శ్రీ ర స్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# ధర్మాంగదచరిత్ర

పాముపాట.



యస్. అప్పలస్వామి అండు సన్సు, రాజమండ్రి.

శ్రీలక్ష్మీవిలాసం ముద్రాక్షరశాల,

సౌకారుపేటపోస్టు, మదరాసు.

1945.] — [దీనివెల 0-6-0

### పుత్రసంతాన సంజీవినూనె.

స్త్రీలయొక్క గర్భమున పురుగులు జేరి ఇంద్రియమును నాశపరచుటచేతను గర్భగోళమునందు కండపెరిగిన రక్తగడ్డయున్నను, వాయువు పైత్యముచేరినను స్త్రీలకు గర్భము నిలువదు. అట్టివారు యీ నూనెను ఉదయం సాయంకాలములయందు 1-టి లేక 3-దమ్మిడీలు తూనిక చొప్పున 15. రోజులు సేవించినచో గర్భగోళముననుండు ఆరువిధములగు రోగములును నివర్తించి ఆమరు నెలలోనే గర్భము నిలుచును. కొందరికి 2, 3 నెలల వరకు నిలచి పిమ్మట పోవుట గలదు.. అట్టివారికి కూడా యీ ఔషధము పరమశ్రేష్టమైనది.

సీసా 1-కి 2-0-0 3-కి 5-0-0

### ధాతువృద్ధి మాత్రలు.

ఈ మాత్రలను ప్రతిదినము ఉదయం పాలలోగాని నీళ్లలోగాని 1 మాత్రచొప్పున సేవించుతూ వచ్చినయెడల ధాతువును వృద్ధిపఱచి నరములకు పటుత్వము కలుగును. కృశించిన దేహమునకు బలమునిచ్చి ముఖమునకు తేజస్సు కలుగజేయును. మూలమునకు హేతువైన వుష్ణమునుతీసివేయును. దేహముచల్లబడి రక్తవృద్ధి కలుగును.

సీసా 2-కి. 2-0-0

### దృఢ ధాతుకరణి.

ఇది అనేక కారణములచేత శుక్లదోషమేర్పడి దేహ పటుత్వము చెడి జీర్ణశక్తియులేక కష్టములో కాలము గడుపువారిని రక్షించు సంజీవికరిని, సకల మేహములు, మూలరోగములు, అగ్నిమాంద్యం, ముఖరోగములు, సోమరి తనము, నడుము, కాళ్లుచేతులు నొప్పులు మొదలగు బలహీనము సకల దుర్గుణములను నిశ్శేషముగా ఖండించును. స్త్రీలకుగలుగు తెలుపు, యెరుపు మొదలగు సకల వ్యాధులను బోగొట్టును.

20 తులములు డబ్బి 2-0-0
40 తులములు డబ్బి 3-0-0

### ఇంద్రియస్ఖలిత నివారణి.

ఈ అద్భుతమాత్రలను ఉదయం ఒకటి పొడిచేసి కొంచం పంచదారలో కలిపి భుజించినతోడనే ఆరౌంసు ఆవుపాలు సేవించ వలయును. ఈ ప్రకారం సాయంకాలమున్ను సేవించవలయును. ఇట్లు సేవించిన అపరిమితమైన ధాతువృద్ధి కలుగును.

సీసా 2-కి 1-8-0

### భోగశోక నివారణ గుళికలు.

సంభోగమైనతోడనే ఈమాత్రలో ఒకటి పుచ్చుకొని పాలు అయినను మంచినీళ్ళయినను త్రాగినయెడల సంపర్గమువలన కలిగిన నీరుచురుకు కాళ్ళుచేతులు దుర్భలమగుట, ఉష్ణ వ్యాధుల నివర్తిచేయును.

20 మాత్రలు 1-0-0

**తేలుకాటు మందు సీసా 2-కి రు 1**

శ్రీ ర స్తు.

శ్రీగణేశ శారదాగురుభ్యోనమః.

# ధర్మాంగద చరిత్ర - పాముపాట.

—(*)—

## —* దేవతా ప్రార్థన. *—

శ్రీపార్వతీపుత్ర శ్రీకంఠతనయుండ ఏకదంతపుస్వామి నీకుమ్రొక్కెదను మందారపుష్పముల చందనంబున నేను - గణనాథ నీపూజ ఘనముగా జేతు గన్నేరుపువ్వుల గరికపోసలతోడ - గణనాథ నీపూజ ఘనముగా జేతు ఆదివినాయకా అమరేంద్రవందితా - విఘ్నేశ్వరా నీకు వేయిదండములు సత్యలోకమునందు చక్కగా వెలసిన - శారదాంబా నీకు కోరిమ్రొక్కెదను పరమేష్ఠి నీకు పదియు దండము లిడుదు - స్థిరముగా జిహ్వలో తిరుగాడవమ్మ విష్ణులోకమునందు నిష్ఠతో వెలసిన - పార్వతీదేవికి పదియు దండములు ఉర్విలో జీవులకు వుత్పత్తి గావించు ఆదిబ్రహ్మకు నేను అరసిమ్రొక్కెదను మూడుమూర్తులకెల్ల! మూలమైనట్టువంటి - వైకుంఠవాసునికి వందనము జేతు కాలకూటమునాడు కంఠమందుంచిన - సాంబమూర్తికి బదియు సాష్టాంగములును అతిభక్తితోను శ్రీహనుమంతునే గొలుతు - అష్టదిక్పాలకుల కలసి మ్రొక్కెదను వ్యాసవాల్మీకాది వరమునీంద్రుల దలతు - నారదాదులకిపుడు కోరి మ్రొక్కెదను ఇంద్రాదిదేవతల కెలమిగా మ్రొక్కెదను - ఆదిత్యరుద్రుల కరసి మ్రొక్కెదను సూర్యచంద్రాదులకు సూటిగా మ్రొక్కెదను - పంచభూతంబులకు నెంచి మ్రొక్కెదను దేవతల నీరీతి భావించి మ్రొక్కెదను - భూలోక కవులకును పూని మ్రొక్కెదను - దండిభవభూతులకు దండంబులర్పింతు కాళిదాసుని గొలుతు కనుభక్తిమీర.

## —* కవి స్తుతి. *—

అలసాని పెద్దన్న కతిభక్తితో మ్రొక్కి పోతరాజునుదలతు ఖ్యాతి మీరగను - రాణింప తెనాలి రామలింగనిదలంతు భాస్కరుని దలతును బాగుమీరగను - నేమముగ తిక్కన సోమయాజికి జాల పదివేల దండములు పరగ నర్పింతు.

## —* శ్రీరామమూర్తి ప్రార్థన. *—

కవులకెల్లను యిట్లు కనుదండములుబెట్టి శ్రీరామమూర్తిని కోరిధ్యానింతు - దండంబు నీకును దయజూడు నాసామి రెండు దండ

ములయ్యా కుండలాభరణ - మూడు దండములయ్యా మునిజనపాలక
నాల్గుదండములయ్యా నలుడవుజనకా - ఐదుదండములయ్యా మునిజనపా
లక నాల్గుదండములయ్యా నల్లుడవు జనకా - ఐదుదండములయ్యా హరి
కుండలాభరణా పదియు దండములయ్యా పాపసంహార - నూరుదండము
లయ్యా నాగసాక్షుజవినుత వేయిదండములయ్యా వేదాంతవేద్య - కోటి
దండములయ్యా పీతాంబరధర లక్షదండములయ్యా పక్షివాహనుడ -
కాకుత్స్థకులతిలక కల్యాణగుణధామ సాకేతపురవాస సకలజనపాల
శరణుసీతారామ శరణు జానకిరామ శరణు పావనరామ శరణు జయ
రామ - నీదయంగ కృపయుంచి నేజెప్ప బూనితిని ధర్మాంగచరిత్ర
ధరణివెలయుగను - బదము సోపము జేసి పాటలెక్కించెదను దశరూప
ధరసన్ను దయజూడవయ్యా - నీను దాసుండనై నేజెప్పబూనితిని తప్పు
వచ్చినగాని మెప్పుసేదయ్యా - దాసుండు చేసిన దోషములు భువిలోన
గురువులనియెంచినాట గుర్తెరిగితియ్యా - అదిగనుక నీను నే సంకీర్తంబును
గూర్చి పదము జెప్పెదనయ్యా ముదముతోడుతను - ఆది బ్రహ్మాంబవై
అతివనిర్మించితివి పదునాల్గు భువనములు పరగ జేసితివి.

—* గ్రంధకర్త దేశవంశాది కీర్తనము. *—

అంబుధులో నేశ్వర నాటలొక్కటి యనగ ద్వీపాంతరములు
తేటగానుండ - అట్టిదీవులలోన అధికమునుగానువంటి జంబుద్వీపంబున
జగతి ప్రఖ్యాతి - అందులోపల గలవు శోంకుగా నేశ్వర ఛప్పన్న
దేశములు నొప్పుమీరంగ - అట్టిదేశనేలెడి అవనితలేంద్రుండు మణుల
మకుటము వెలయుచున్న సుల్తాను - వసుధనృపసపాలి వంశాబ్ధి వెలిగింప
రాకాసుధాకర రమ్యగుణశాలి - ఘనుడువిజయరాగాను గజపతి మహా
రాజు కిరీటమహాంధాత కీర్తివంతుండు - అట్టిమహారాజపు అవనిపాలిం
చగ వసుధబురము మోలి నరరాజధాని - విజయనగరంబున వింతపట్న
ముగలది పట్నమునకు నాల్గుపరగనాలుండు - హాట్యాన్నరుపరగణాభోగా
పురము రెండు దేవుపల్లెయనంగ తేజరిల్లగను - వీనికంటెనుచాల విస్తా
రమైనట్టి శంశాబాదుపరగణా చెప్పబడుచుండె - పరగణాల్నాల్గులోపన్నెం
డుతాలూకాలు నేర్పుగానుండె నెలనిమిరగను - అట్టితాలూకాలవుడు
హాములు జేయుచునున్న అమీనాదుల్ అను పేర నవనిప్రఖ్యాతి - వసుధ
శ్రీయల్లగాంతి వంశాబ్ధిచంద్రుండు సోమరాజను పేర పేరిమతోనిపుడు -
సామిలు సేయుచునున్న రామురాణాలో పట్టియునగారిమంబు -
పాలువ పురంబున నిపుడు అమలునకువచ్చిన హరిహరభక్తుండు అత

దైవ్వడన - ఘనతాతతండ్రులు గట్యాడకోరాము బురములో వెలసినప్రా
ర్వ్యులందరును - తరువాతసతివాడ మరమందు వెలసినసకలజనులునుచాల
సద్గుణుండనగ - వసుధలో యీపూరి వంశాబ్ధిచంద్రుండు పేరుపాయ
రాజు ప్రేమచేగాంచె - నాయనకు నగపత్నియైనట్టి గుణశాలి జగ్గమ్మ
యనుపేర జగతిప్రఖ్యాతి - వారలకు యిరువురు వరపుత్రులైనట్టి సకల
విద్యలునేర్చి జగతిలోపలను - రాణించు భసవలోను రామచంద్రారాజు
కీర్తిచేవెలసెను పూర్తిగానపుడు అతని సోదరుడైన ప్రతిభ కీర్తినీతుండు
నారాయణరాజు పేరు తెనిగించి - తాతవెంకట్రాజు తనయువ్వాజగ్గమ్మ
వారలకుపదివేలు వందనంబులుజేసి అభివృద్ధికోరుకున్నా నుదినంబు
నను - తనమేనమామరు ధరనిరునువాయి అప్పలరాజుకు అభిభక్తిమ్రొ
క్కి - తనగురువు లయినట్టి ధరణిశాస్త్రి రాజు వెంకప్పపంతులకు వేయు
దండములు - మరిపెద్దలకు నెల్ల మారుగామ్రొక్కితిని పిన్నలకుదీవించితి
ప్రియముతోడుతను - పదిరెండువేండ్లాయె బాలసపురంబులో కాపు
రముపొందితిని కర్తవశమునను - సకలశాస్త్రములెల్ల చాలశోధించి
యీకథయు చెప్పుదును నిదిపూర్తిగాను - సహసపులగద్యాన మజీపాము
పుట్టుట విననేరు గననేరు విశ్వంబులోన - ఈ నాటికీ కాను నిదిగాను
వచ్చెను చిత్రకథ యిదిగనుక చెప్పబూనితిని.

—* గ్రంథ ప్రతిజ్ఞ. *—

ఆశ్చర్యకథగనుక సుందరికిదెలియుంగ పదముల చెప్పదనయ్య నము
దముతోడుతను - పుణ్యకథ యిదిగనుక పొందుగావినరయ్య వినిన విరాజ
నుదొరకు విష్ణులోకంబు - నితరచింతలుమాని చేకచిత్తంబుగా సభ
వారువినిరంచె చక్కగావినుడి - యతిగణంబులు నెరుగ యతిప్రాసమును
నెరుగ భక్తినిసముచేత ఫలము చెప్పెదను - తప్పినప్పిన చోట రొప్పగా
మజీదిద్ది తెలియ జెప్పగవలెను తేటమీరగను - భవసంవత్సర భాద్ర
త్రముసంను శుద్ధపాడ్యమిసరికిపెంపుగానయ్యె - సారెకునునివూరి నారా
యణరాజు యీకథను తెలిగించెయలముమీరగను । బాలసపురంబులో
ప్రఖ్యాతివెలసిన మీకథయుచిత్రంబు నిదియట్టిదనిన । జకనాడు గౌతి
ముండకలంకచిత్తుడై తనభార్య సహల్యతో తానుకూర్చుండె । అపుడు
వరుడునుతాను వరుసగాకూర్చుండి సొగటాలు ఆడుచు సొంపుమీరంగ
ముచ్చటాడుచు సతిని ముదముతోనడిగెను వినవయ్య నాయనవి వినో
దంబుగాను । గౌతముండపు నీవు ఘనపుణ్యమూర్తివి నకు తెలియనికథ
లు లోకమున లేవు । తారమండోదరి ద్రౌపది కుంతియును పతిభక్తి

గలిసిన పణతులెవీరు । అతిపతివ్రతలంచు అఖిలజగమ్ములయందు విను చుంటినేనును విశదంబుగాను । వీరికంటెను మిగుల విశ్వంబులోపల పతి భక్తి గలిగిన పడతులున్నారా । అనియామెబలుకంగ నానందముగ నవ్వి గౌతముడు తాబలికె ఘనముగానేడు । వీరికంటెను మిగుల వీరపతి వ్రతకధ జెప్పెదను వినుము కలికిరోసివు - భువిలోన కాశ్మీర పుణ్యదేశ ముగలదు అట్టిదేశములోను అధికమైవుండు । ఆపురంబునున్న యంద మంతయుదెల్ప నజునికైనను గాని యలవి గాదనెను । సంగీత సాహిత్య సరసవిద్యలుగలిగి వేదములువల్లించు విప్రులేగలరు - వసువుసాముల చేత చాలపెంపొందుచును రాజు నాపురిలోను తేజముగ గలడు - అలరు చేరునిరాజ్య మతనిపట్టణమెల్ల కుసుమవబట్టగజాలు కోమట్లుగలరు । పలు కుభొంకులు లేక పలుసంపదలతోను శూద్రమనాపురిలోను సొంపొంద గలరు । కోడిపుంజులకన్న కొవ్వాడి మదిగలిగి భటులుందురాయూర పటుతరంబుగను । వాయువేగముకన్న వటిలావుమదిగలిగి గుఱ్ఱాలు కోటాన కోట్లుగానుండు । కులగిరులమునను కూలదన్నగజాలు మదపు టేనుగులందు మతిచాలగలవు । ఏవీధిజూచిన యెడ తెరపి లేకుండ రధములే తిరుగును రాత్రి పగలనక । యతులకైననుగాని మతులు భ్రమించెడి నెరజాణవేశ్యలు నిండుగాగలరు । నీరగంధములతో నోర శిఖలునుగలిగి మెఱయుచు విటగాండ్రు తిరుగు వీధులును । రత్నాల మేడలు రంగయిన చావళ్ళు । నేవీధిచూచినను యేమిగానుండు నిర్మ లంబయినట్టి నీరుబావులుగలవు । యేవీధి వారలకు నావీధిలోన ఇం టింట పెరటిలో నరటిమామిళ్ళుండు నారి కేళములుండు కోరినట్లు గను ధనధాన్యములచేత దనరారుచున్నది కనకాపురము పేరు ఘను లుమెచ్చగను ఆపురం బేలెడి యవనిత లేంద్రుడు । ధర్మాంగ రాజనగ ధరణిప్రఖ్యాతి ఆరాజుయేలెడి యారాజ్యమందున । ధర్మహీనులు లేరు దలచిచూడగను పెద్దలుండదిచావు పిన్నలకులేదాయె । నారాజుపాలన మదియేమొకాని పేదసాధలులేరు భిక్షకులులేరాయె । వూరూర శుభ ములు కోరిచూడగను ధర్మాంగదుడు యేలు ధరణిలో ప్రజలకును । ధర్మబుద్ధులుగాని తటవిటలులేవు ఆరాజుభార్యయు నర్మిలిదేవినా । పేరుగలభామిని పెంపొందుచుండె ఆదంపతుల పొందు నింతింతయన రాదు । పార్వతీశంభులు పగిదిగానుండు ఆరీతిధర్మాంగు డవని బాలిం పుచును । మఱి కొన్ని దినములకు మంత్రులనుజూచి మంత్రికోవిదు లార మామాట విన్నార । మాకు సితుతోటచే మీకు జెప్పెదను ।

మీసహాయముచేత మేది నీపాలన సదలిసంపదలెల్ల చాలగాగలిగె.

—* ధర్మాంగరాజు సంతానములేక చింతించుట. *—

సకలభాగ్యముగలదు సంతానమేలేదు పుత్రసంతతిలేని భూభారమేల । సహదలేల కదలేల నతిరథంబులునేల హితులేలసతులేల యీ భాగ్యమేల । పుత్రులే లేకుంటె పుణ్యంబు లేదని వేదవాక్యంబులు విన్నారుకాం । సుతులు లేకున్నచో గతులు లేవనుచో గతులు మాటలో వాడుక యనిరి ప్రాకటంబుగను । అని మంత్రివరు నారాజు పలుకంగ సంతానమునకునై చింతింపుచుండ్రి । ధర్మ రాజపుడు తలపోయుచుండగ కొంతకాలమునకు కోరినట్లుగను । దైవ యోగంబున దనభార్యయర్మిలిక గర్భంబునిలిచెను గతిమోహమునకు చాలకాలంబునకు చాలయర్మిలిదేవి నెలదప్పె ననుమాట నెలతలంద రును । రాజుగారితోను రహస్యముగ జెప్పంగ వినిరాజుమితిలేని వేడ్కతోనుండె.

—* అర్మిలీదేవి గర్భము దాల్చుట. *—

పురజనులు నీమాట పొందుగా విన్నారు ఆనందముగనుండె నద్భుతంబుగను । ధర్మాంగద రాజునకు తనయుండు పుట్టునని భూసురోత్తములెల్ల బాగడుచుండిరిగ । అందరును నీరీతి నానందముననుండి నెలతకంతంతకును నెలలుగడచెనుగా । ఆఱునెలలాయెనని యతివకును సీమంత గాజులనుదొడగిరి తేజమలరగను । ఏడు నెనిమిదినెలలు వేడుకతోగడచెను తొమ్మిదవమాసంబు తొందరగ వచ్చెగ । అలసటలు లావాయె నతివకంతంతకును నీళ్ళాడప్రొద్దులే నిండినంతటను - మంత్రిసానులుచుట్టు మతిగూడియుండిరి చుట్టాలు బంధువులు చూడవచ్చిరిగ లగ్నమునవేళలు రాజుగారియొద్ద పరికింపుచుండిరి బ్రాహ్మణోత్తములు నీరీతికొందరు మెలమితోనుండగ గర్భవేదనబుట్టె కాంతకంతటను - వేదనలు రావాయె వెలది మంత్రసాని కాచియుండెను సెజ్జగా చేరి యపుడు - లోకమార్గమురీతి లోలాక్షి బాసినది బుగులుబుగులుయనుచు బాగలువచ్చెనుగ.

—* అర్మిలీదేవి పామును గనుట. *—

రెండునాలుకలతో నిండుపడగనుగల్గి చిఱ్ఱి బుస్సా మనుచు శేషుండుబుట్టె - పుట్టగానెజూచి పాలతిమంత్రసాని దెయ్యామనిసలాగు దెబ్బకనుపడెను - అగులు బొగుచున్న యపుడు చెలికత్తెలు ఇలువెడలి బారిరి ఇదివింతయనుచు - దాదులునుపరుగెత్తిధర్మాంగరాజుతో శేషుం

డుబుట్టెనని చెప్పి రందరును - చెప్పగా నేరాజు తప్పకనుప్పార్భిల్లి కొంత
దడవుకు లేచి - వింతగా బలికె మంత్రిపుంగవులార మాభాగ్య మిట్లుండె
నేమిసేయుదు నేను నెందుజొచ్చెదను - పాము మనిషికి బుట్టె పాపంబు
నదియేమి విశ్వంబులో లేని వింతొకటిబుట్టె - ఈ లాటి పాపంబు నెన్న
డువినలేదు నానాటికిబుట్టె నాభాగ్యముననూ - యేమి సేయుదు నేను
యేలోకమున జొత్తుగాకేమితోచదు నామంత్రివరుడా - ధర్మాంగరాజ
పుడు ధైర్యంబుచెడిపలుక మంత్రిపుంగవుడు మారుదాబలికె.

—* ధర్మాంగరాజును మంత్రులు వోదార్చుట. *—

ధర్మాంగరాజవు ధైర్యంబువిడరాదు రహస్యమును జెప్పెదను
రాజాధిరాజ - ఈవార్తభువిలోను నెవరువిన్నను గాని చులుకదనమేక
లుగు చూడగా మనకు - పుత్రుడుబుట్టెనని బురములో చాటించి భూరిదా
నములిమ్ము భూసురాళికి - లేకున్న నపకీర్తి లోకమునమనకబ్బు నాడికలు
సమకూడు నపకీర్తివచ్చు - మంత్రిపుంగవులిట్లు మంతనము దెలుపంగ
నాలాగుననుచేసె నవనిపాలకుడు - అర్మిలిదేవియును నహీంజరాజ నేజూచి
తనభాగ్యముకు నగతగలయూచిపలికెనె - చెలులార యిదియేమి చెప్ప
శక్యముగాని నాగేంద్రుడును బుట్టె నాగర్భమునను యీలాటి వింతలు
యేలోకమున లేవు నానాటికివచ్చె నాభాగ్యమునను - వచ్చినకర్మ
నగవగా బనిలేదు నాచిన్న శేషునకు నాతులందరును - జలకంబు
లాల్చరే జలజాతముఖులార తడియొత్తి ధూపములు తగనియ్యరమ్మ
అనిపెట్టె తెప్పించి యందు దానినియుంచి పాలుబోసియు పెంచె ఘనతి
అర్మిలియు । ధర్మాంగరాజునకు తనయుండు పుట్టెనని దేశాధిపతు
లెల్ల తేటగా వినిరి । గొప్పయేలిక యతడు వొప్పుగా వానితో వియ్య
మునందవలె వేడుకలుమీర । ననుచు దేశాధీశు లానందమున పొంగి
వొకరికంటెను ముందు నొకరు త్వరపడుచు । వీరకాంద్రంచు కోరివా
ర్తలుదెలిపి పత్రికలు వ్రాసిరి పరమహర్షమున । నాపత్రికలు చూచి
యతిలజ్జితుండగుచు ధర్మాంగరాజపుడు తనమంత్రితోను । వోమంత్రి
పుంగవా యేమందు నీవేళ తమకుతామేగోరి ధరణీశులెల్ల । తమతోడ
వియ్యంబు తగనందవలయుననిచెప్ప తరముకాని జాబులంపిరిగా । వారి
వారికేనేను తిరుగనేమని వ్రాతు నాకేమితోచదు నామంత్రి వరుడా -
అని యిట్లు ధర్మాంగు డతిదీనతను బలుక వినమంత్రిపుంగవుడు వేడు
కనుబలికె - యింతమాత్రముచేత చింతనీకెందుకు మీకు కార్యముతుద
కు మేలుచేసెదను - వారిపత్రికలకును మారు పత్రికలిపుడు తగినట్టువ్రా

యుండి తడఫ్రసేయుకను - ఆలాగు వ్రాయించి ఆపైని కొన్నాళ్ళు గడచి
పోయినవెనక ఘనమంత్రివరుడు - రాజుగారినిపిలిచి రహస్యముగనొక
నాడు· ఆలోచనలుచేసె నతివింతగాను - రాజాధిరాజువై రాజ్యమున
నుతికెక్కి ఘనారకుండుటమీకు యుచితంబుకాగు - తగినవియ్యపుచోటు
తక్షణమెపరికించి సుందరంబయినట్టి సుదతినేజూచి - మన నాగరాజునకు
మాయకల్యాణముజేసి పెండ్లిచేయగవలెను పెనుఖ్యాతిగాను - పేగ-
కీర్తి లోకమున మనకబ్బు హీనుగాజూతురు జనపతులుమనల.

—* పెండ్లికూతురుని చూచుటకు బ్రాహ్మణులను బంపుట. *—

అని యిట్లు తగచెప్పి యాతక్షణముబంపి తనపురోహితులను తాను
రప్పించె - విప్రపుంగవులార వేగమే మీరిపుడు చప్పన్న దేశముల
నొప్పుగానేదకి - సాంప్రదాయకమైన సామంత గృహములను సొగసైన
మఱిచిన్ని సుదతినేజూచి - హస్తంబు బరికించి యాయుర్దాయముచూచి
ఐదవతనముజూచి ఆరుబలముజూచి - తల్లిదండ్రులజూచి తారతమ్యము
లెంచి వారివంశములో వరుసపరికించి - గోత్రనుంబుపరికించి పాత్రితను
నురినెంచి మాట్లాడవలెనట్టి మహిమగలయింట - పదియారువన్నె మే
ల్పసిడిబొమ్మలకన్న మిగుల చక్కని యట్టి మగువనెజూచి - మనరాజు
కొమరునకు మాట్లాడిరావలెను మీరు నేర్పు మహిమలు మేలుదెలియు
గను - మేడకొలకునుమీది నిట్టొకటిజేసెదను నేరుపున వారితో కోరి
చెప్పండి - మారాజు వంశపు మర్యాద వినరయ్య విశ్వంబులోలేని విం
తొకటికలదు - అత్యంత సుకుమారుడౌ మగబాలుండు పట్టంబువెలువడి
పరదేశమునకు - తర్లించడమునకు తండ్రిగారొప్పరు వారివంశపురీతి
వేరుగానుండు - తమచెలికత్తెకి తగబాసికముకట్టి సకల సంభ్రమము
లతో చాలతర్లించి - కత్తికిని కాంతకును కరమొప్ప తలంబ్రాలు
పోయించి తగపెండ్లి చేయించి యుంచెదరు - బుద్ధిమంతులు మీకు బో
ధైతెలియవ్వండి యిలువరుస నడవళ్ళు యిలలోన గలవు - అని యిట్లు
వారితో వినయంబుగా పలికి నేరుపున సభలోన నిర్ణయించండి -
తిరుగ మరుగలులేక తేటగను ఖండించి యతివేగ రావలెను మతిమం
తులారా - ఆరీతిగామంత్రి అన్నిసీతులు జెప్పి దారి ఖర్చిచ్చెను కోరి
నట్లుగను - రాజమంత్రులయొద్ద తేజముగ సెలవంది భూసురులు వె
ళ్ళిరి భాసురంబుగను - కాశ్మీరదేశంబు కడువేగమే గడచి మరునా
డువెళ్ళిరి మనల కుండగను అంగవంగకళింగ బంగాళి నేపాల పాంచాల
మలయాళ బహురాజులిండ్ల - మాళవ మహారాష్ట్ర మలయాళకురు

భోజ ద్రవిడాంధ్ర కర్ణాట ధరణీశులిండ్ల - కరహాట వైదర్భ గంధర్వ సువిధేయ పార్ణాటయుతపౌండ్రి బలరాజులిండ్ల - భల్లూక కోసలుల బాగైన గేకయుల దాశార్ణ పాదార ధరణీశులిండ్ల - శౌరిసేనులయిం డ్ల సారిదినిశోదించె మత్స్యరాజులయింట మరల శోధించె - కొంకణ దేశంబు తెలివితో శోధించె కొంకణదేశంబు కోరిశోధించె - సకలదే శములందు సరగునను శోధించి తగినచిన్నదిలేక తటపటలు పడుచు మనమువచ్చినరాక మఱికూడ రాదాయె నేమనుచు రాజుతో నెరిగిం తుమనుచు - ఖిన్నమానసులగుచు తిన్నగా తమయూరు తిరిగివచ్చు చునుండ మఱిదారిలోన - వారికొక విప్రుండు కోరినట్లుగ వచ్చి యె దురుకొని వృత్తాంత మంతయు నడిగి - మీరువచ్చిన పనికి మేలు చెప్పెద నేను వినరయ్య బ్రాహ్మణులు వేడుకలమీర - సౌరాష్ట్ర దేశమున చక్కగా విలసిల్లు మాణిక్య పురమను మఱి పట్టణంబు - ఆపట్టణంబేలు నవవితలేంద్రుండు రత్నాంగుడను పేర రంజిల్లుచుండె ఆరాజునకుకూతురయినట్టి త్రైలోక్య సుందరి అను పేర శోభిల్లుచుండు ఆకన్యకామణి యందమంతయు దెలుప బ్రహ్మదేవరకైన సాటిగా. దయ్యా - ఆపట్టణం బిటకు నైద్యామడున్నది వేగిరము వెళ్ళినను వెలది సమకూడు - అని యిటుల విప్రుండు యతివేగమున బలుక మాణిక్య పురమునకు మళ్ళిరావేళ - అతివేగమున నడచి యాపట్ట ణముజేరి రత్నాంగు డున్నట్టి రచ్చకేతెంచి - తమరాక రాజునకు తత్క్షణంబు నెఱిగించి సన్నిధికి చేరిరి సరసమలరగను - రాజుగారును మ్రొక్క రయమున దీవించి కోర్కెతో విప్రులు కూర్చుండిరచట.

—* బ్రాహ్మణులు రత్నాంగ రాజునొద్దకు బోవుట. *—

మఱికొంత తడవునకు మహితిలాధిపుడైన రత్నాంగ రాజుతో రాజసంబుగను - తమరువచ్చినరాక తగజెప్పనడగిరి నేరుపు విప్రులు కోరికలరగను - కామితార్థము లిచ్చు కాశ్మీరదేశమున కనకాపురం బన్న ఘనపట్టణంబు - ఆపట్టణంబేలు సతిధర్మ నిరతుండు ధర్మాంగ దుండనగ ధరణి ప్రఖ్యాతి - ఆరాజునకు భార్య యర్మిలీ దేవియు నత్యంత గుణవతియు సతిపుణ్యవతియు - ఆ దంపతులకును నతిసుంద రాకారు డైనట్టి కొమరుండు అరయజన్మించె - ఆ చిన్న బాలునకు నవనిరాజులయిండ్ల బాలనే చూడుమని పంపెను మారాజు - ఆరీతిగా మేము అవనిలోగల యట్టి దేశదేశములెల్ల తిరిగి వేసారి - మాదే శముమేము మరలిపోవుచునుండ మార్గమున విప్రుండు మాకుజెప్పె

నుగా - మా శిక్యపురమందు మండలాధిపునిండ సొగసుతో నమరెడి
సుదతి గలదనుచు - సమ్మకము జెప్పంగ నిమ్మగా నిటనడచి తమ
దర్శనముచేయ తడయకొచ్చితిమి - తమ చిన్న బాలికను తడయ
కను నిచ్చుటకు తోడి తెప్పించుమడీ చూడగవలె ననగ - ఆ మాటకును
రాజు ఆనంద మగ్నుడై బాలనే తెమ్మనుచు నంపె దాసులను - దాదు
లేపరుగెత్తి యగచిన్న బాలతో నీవార్త జెప్పిరి చెలిమి మీరగను
చెప్పగానే యొప్పుగా సుందరికి ముస్తాబుచేసిరి ముదముతో
కురులు నున్నగదువ్వి కొప్పును సవరించి జడతీర్చి నగలింత చెలువు
మీరగను - శిరమందు శశిపువ్వు చంద్రవంకయు నుంచి రత్నాలు
చెక్కిన రాగిడివుంచి - చేర్చుక్క బొట్టుతో చెన్నొందు చున్నట్టి
పాపట బంతులు బాగుగాదిద్ది - కమ్మలును రసభవిరె కర్ణపువ్వులు
దాల్చి దుద్దులును జుమబులు దిద్దినట్లుంచి - పొలుపొందు రత్నాలు
బుగడలే ధరియించి మద్దియ కాయలుబెట్టి డాగున కాళ్ళను - చిమి
టిబావిలిని చిన్నారి చెవులుంచి నీలాలు బావిలి నీటుగా దిద్ది - కోన
గాసిలీలు కాంతచెవులనువుంచి పుటకబావిలీలు పొలతికుంచిదిగాన -
చెప్ప శిక్యముకాక కొప్పుగొలుసులువుంచి తళుకు బాసిలీలు తరుణి
కుంచిరిగా - మినమిన్ల్ దళుకొత్త మేల్ బుటారవికెయు తొడగించి
దాదులు రంగుమీరగను - మురుగులు గొలుసులు మురిడీలు పోచీలు
వనితకు బెట్టిరి వామహస్తమున - గరగడియలు మంచి గాజులను
తొడగిరి చిన్నారి చేతులకు చెలువు మీరగను - బాజిబంతులు మంచి
బాగైనయాదండ కడియాలు బెట్టిరి కాంత దండలకు - గొప్పకుత్తీ
దంటు పొందుగా నొడమంచి అడ్డిగలు వేసిరి అతివ దండమున -
చంద్రహారాలపుడు చెలియ మెడలోవేసె - నవరత్న హారాలు నాతి
మెడవేసె - చిలుకలు తాళీలు చిన్నారి మెడనుంచి గిలకసరిపేటలు
కలికిమెడవేసె - పులిగోరు పతకంబు పొలతికి ధరియించి వరహాలపే
రులు వనిత మెడవేసె - మేల్మి బంగరుసేరు కఠాని గుండ్లుంచి మిరి
యాలపేరులు వనితి మెడవేసె - నల్లపూసలదండ నాతిమెడలోవేసి
శంకు పూసలసేర్లు పొంకముగవేసి - పచ్చాలుదిద్దిన పట్టుతొ బొంద
వుకు చిన్ని సుందరిని మొలకు వన్నెమీరగను - చెంగావి చీరయు రం
గుమీరగ గట్టె చూపరులు నాశ్చర్య చోద్య మందగను - సింహమ
ధ్యముబోలు చిన్నారి నడుమునకును వడ్డాణ ముంచిరి వన్నెమీర
గను - మొలవడ్డాణంబు మురువులు దొడిగించి ఆ పైని నుంచిరి ఆ

బాలకపుడు - ఇమ్మైన మొలపైని కమ్మరవరాబెట్టి • చిలుక యొడ్యా
ణంబు చెలియుకమరించి - పావడాల్కాళ్ళకును పాంజేబులను తోడగ
అందెలును మువ్వలును అమరదాల్చిరిగా - వేళ్ళకును పిళ్ళేలు వెం
డిమెట్టెలుబెట్టి గజ్జెలేకట్టిరి కాళ్ళకంతటను - ఈరీతిగన సొమ్ములిమ్ము
గాధరియించి సంపెంగ మూనెతో చెంపలే విరచి - వంకవజ్రపుకమ్మి
వరనాసికనునుంచి ముదువైన ఆణిముత్యంబులుబెట్టి - నవరత్నమయ
మగు నత్తుముక్కునబెట్టి ముక్కుపుడకనువుంచి మదికి కొకవంక -
అత్తరవు మిళితమగు అగరు గంధంబులను - మెయిపూప పూసిరి
నెలత కంతటను - అర్ధచంద్రునిబోలు అతివ నెన్నుదురుపై కస్తూరి
తిలకంబు ఘనముగాదిద్ది - అద్దాలనులోను అతివ చెక్కిళ్ళను కుం
కుమరేఖలు కూర్చి దిద్దిరా - అలచిప్పలను బోలు వాలుగన్నుల
కపుడు కాటుకుంచిరి మెంతో నీటుమీరగను - పసిడిబొమ్మనుబోలి
బాసిలు సుందరికి మేలైన వలె జన్న మేలు ముసుకిచ్చి - కప్పూరపు
విడియంబు కలికి చేతికియిచ్చి తల్లిగారంపిరి తండ్రిసభకపుడు - ఈ
రీతిగను బాల యింపుసొంపులు గులుక ముసిముసి నగవుతో ముందరను
వెడలె - చెలికత్తెలి లిరుగడల చేతులూతలు గొనుచు నడిచివచ్చిరి
చాల నవకమలరగను - కాళ్ళయందెలు ఘల్లు ఘల్లు మనుచు
మోయంగ నడుగడుగునకు ముద్దు లల్లాడగాను హంస నడక
రీతి నతిబాల సుందరియు అచ్చోట నిలుచుండె అతివింతగా - పున్నమ
చంద్రుడో పుల్లార విందమో మదునిచే ములికియో కలికియోయను
నగ । సుందరంబైనట్టి సుదతి యీరీతిని తనతండ్రి యొద్దను తాను
నిలుచుచుండె । నిలుచున్న బాలను నిండారగను బిలచి తనతండ్రితొడ
లపై తగనుంచు కొనెను । భూసురోత్తములెల్ల బాలతి అందముజూచి
మూర్ఛిల్లి రంతట మూఢమతులగుచును । అంతలోనటుదెలిసి యింతిని
పరికించి తలయూచె రాజుతో తగను బలికిరిగా । మా చిన్నరాజునకు
యీచిన్న సుందరికి రతిమన్మథులకట్లు రమ్యముగనుండు । ఈ యంద
చందమీ వన్నె చిన్నెలలోను ఇద్దరికి నొకరీతి దిద్దినట్లుండు । ఈరీతిగను
బలికి యింతిహస్తముబట్టి ఆయుర్దాయ రేఖ లపుడు పరికించి । ఐదవతనం
బును ఆ బాలికనుజూచి సంతాన రేఖను చాల పరికించె.

—* బ్రాహ్మణులు సాముద్రికము చూచుట. *—

సతిపతుల సంయోగ సంతసంబులుచూచి సంతోషమునవారు
సభయుచేవిడిచి । రత్నాంగరాజుతో రభసమునపలికిరి మీబాలహస్తం

బుమేలుగానుండె । మీసుందరిని యిపుడు నూటి మారాజునకు ఇప్పిం
చకోశెద ఁప్పగానవిరి । అన యిట్లు బ్రాహ్మణులు వినయంబుగా
బలుక రత్నాంగ రాజపుడు రాజసంబుగను । ధర్మాంగ రాజపుడు ధర
ణిలో బుణ్యాత్మ్ముడెరుగుదుము ఆ మాట మఱిచెప్పనేల । మీ రిటను
మాబాల సునెల్ల జూచితిరి మీరాజకొమరుని మేముపరికించి । చూచి
నపైగదా సుందరి నిచ్చుట లగ్నవిర్ణయమపుడు లలితముగ సు
ఆరీతిగను బలికి అతిసమ్మతంబైన తన పురోహితులను తగను బలి
విప్రపుంగవులార విన్నార యొకమాట మన చిన్న సుందరిని మాసు
నపుడు । తమరాజ సుతునకు తప్ప కిప్పించుమని అడుగవచ్చిరి ఇదిగో
అవనిసురులిపుడు । వారుమనబాలిక తీరెల్ల జూచిరి మీరిపుడు ఆరాజు
మేలుచూడండి.

—* రత్నాంగనుడు తన పురోహితులను బంపుట. *—

ధర్మాంగదుండతడు ధరణీసులకుమేటి గనుక వేగమెవెళ్ళి గను
గొనవలయు । మీరు చూచిన వెనుక మేలుగా మరిలగ్న పత్రికలు
వ్రాసెదము పరమహర్షమున । ఆరాజ సుతయొక్క అంద చందము
చూచి బుద్ధులను విద్యలను సుద్దులచూచి । హస్తంబుపరికించి ఆయుర్దా
యముజూచి నిర్ణయించుక మీరు నేడురావలెను । తగనిట్లు సెలవిచ్చి
తమపురోహితులంపి అచ్చటికి వచ్చిన అవనిసురులకును । ఘనముగకట్న
ములు కడువేగమిప్పించి సెలవిచ్చి పంపిరి. శీఘ్రంబుగాను । వారువీరు
నుగూడ దారినడచిరి నేడు పెద్దపెద్ద మజిలీలు పెంపుతోడుతను । అతి
వేగమున నడచి ఆనందమునవారు కనకాపురము జేరి - కడు వేగముననను
రాజమంత్రులతోడ బ్రాహ్మణులు వచ్చుటను చెవిలోన జెప్పిరి చేరి
యాభటులు । చెప్పగానేరాజు తప్పకనుమూర్ఛిల్లి కొంత తడవుకు లేచి
చింతింపదొడగె । ఏమిసేయుదు మంత్రి యేలోకమున జొత్తు లోక
మున నపకీర్తి నాకు వచ్చెనుగా । పెండ్లికొడుకును వారు ప్రేమతో
చూతురు యెవ్వరిని చూపింతు నీవేళ నేను - చింతనొందుచురాజు విం
తగాబలుకంగ మంత్రిపుంగవు డపుడు మారుగా బలికె । ఇంతమాత్ర
ముచేత చింత మీ కెందుకు నాసుతునిచూపెదను భూసురావళికి నాకొ
డుకునేచూపి నెలతనిటుదెచ్చెను నీకెందుకిచింతనేడు నారాజా । అనుచు
దిగ్గునలేచి అతి సుందరాకారు డైనట్టి తన సుతుని అపుడు బిలిపించి ।
మేలుగా ముస్తాబు వీలుగాజేయించి రచ్చలోనుంపించె రాజసంబునను ।
చూడవచ్చిన వారి తోడుకొని రమ్మనుచు అరకార్లనూ బంపె అతి

శీఘ్రముగను । పంపగానేవారు పరుగెత్తి పిలువంగ భూసురులువచ్చిరి భాసురంబుగను । వచ్చినవారిని వోనయిన స్థలమందు కూర్చుండ నియమించి కొంత తడవుండ । మారాజ సుతుమాడ మీరు వస్తిరి గనుక చూడండీ బాలుని సుందరంబెల్ల । విద్యలను బుద్ధులను వీరత్వమును చాల పరికించి చూడండీ బాలునికమీరు.

—* బ్రాహ్మణులకు మంత్రి తనకొడుకును చూపుట. *—

చదువుసాములు మిగుల సంగీత సాహిత్య చతురత్వములుచూచి చెలియనివ్వండి । విద్యలందాననే కొరతైన వుంటేను మా రాజు కీవలదు మగువను మీరు । అని యిట్లు తన మంత్రి అనుకూలమున బలుక విని బ్రాహ్మణోత్తములు వేడుకను బలికి । రో మంత్రిపుంగవా ఏమందునీతోడ మీరాజ కొమరుని తీరేమి కొదువ । అనుచు ఆ బాలుని అపుడు చెయిపట్టుకొని హస్తరేఖల జూచి అనుకూలపడిరి । ధర్మాంగదుని సుతుడు నిర్మలాత్ముం డతడు మారాజుతో జెప్పి మగువనిచ్చెదము తిరుగు మరుగులేక తీరైన సుందరిని యిప్పించవడము యింక నొప్పుకోబడియె । ఆమాటకును మంత్రి ఆనంద మగ్నుడై వారితోడుత బలికె వేడుకలరగను । భూసురోత్తములార బుద్ధిమంతుల మీరు మా రాజుగారింట మఱియొకటి గలదు । వారింటి యిలువరుస వేరుగా నున్నది లోకమున లేనట్టి యాచారమొప్పు - ఆమాటకు సుమారు ఏమనందురోయికను చెప్పెదనువినరయ్యా చిత్రకథయొకటి - స్వైరైనవారైన పెండ్లికొడుకును వీరు పరదేశమునకును బంపుటయు లేదు - కత్తికని బాసికము కట్టి తర్లించుకొని సంభ్రమముతో రాగ చక్కగా జరుగు - కత్తికని కాంతకునుకట్టితర్లించుకొనిసంభ్రమముతో రాగ చక్కగాజరుగు - కత్తికని కాంతకును కరమొప్ప తలంబ్రాలు పోయించి తగ పెండ్లి చేయింతురపుడు - వీరివంశమునందు తీరుయీలాగుండె వారేమి యందురో మా రాజుగారు - ఇరువరుసనడవడి యిలలోన నెవరైన తప్పింపజాలరు యిప్పటికైన - మీరాజుగారితో మేలుగామానునవితిరిగివినిపించియో తరగెల్ల చెప్పి - మిగులనేర్పనమీరు మేదినీపతితోడ సంతసంబున జెప్పి సమకూర్పవలయు - తనకుకార్యంబులు మిగుల సమకూర్చిన పుణ్యాంబుగలదనుచు బుధులుచెప్పెదరు - ఈకార్యమంతయు ఇంకను మీవలన మఱి వేగకావలెను మాటలేటికిని - మంత్రిపుంగవు డిటుల మాయపలుకులు పలుకక విని సమ్మతించిరి విప్రపుంగవులు - కట్నంబులనునిచ్చె ఘనవస్త్రములనిచ్చె భూసురులకావేళ ఆశదీరగను - రాజమంత్రులయొద్ద రభ

సమున పొందుచందీ తిరిగి చనుదెంచిరి మరివారిపురికి - మాణిక్యపురము
నకు మెరిసెదమేచేరి రత్నాంగరాజుతో రాజసంబుగను - ఒకరాజదేవేం
ద్ర యొప్పగామీసెలవు శిరమునను ధరియించి శీఘ్రంబుగాను - కనకా
పురముజేరి ఘనమైన ధర్మాంగ రాజునేచూచితిమి తేజమలరగను -
ఆరాజకొమరుని అతిసుందరాంగుడౌ ఘనమైన బాలుని యుప్పు
టిగా - విద్యలకు విజయుండు బుద్ధులకు బృహస్పతి ప్రజలకు
పెంపొందెనతడు - మన్మథా కారుండు మరి చెప్పగా నేల అ
లుండు అవనిలోలేడు - ఏవిధంబున నగుచున యువుకుమనసుందరిని ఇచ్చు
టనుమంచిది యెంచిచూడగను - అన్ని బాగున్నవి పెండ్లికొమరునివారి
పరదేశములకును పంపకుండుదురు - కన్నికే బాసికము కట్టించుకొని వేగ
సకలసంభ్రమముల చాలగా తర్లి - కన్నికిని కాంతకును కరమొప్పు తలం
బ్రాలు పోయించి తగపెండ్లి చేయించువారు.

—* కన్నిక బాసికము కట్టుటకు రత్నాంగునితో జెప్పుట. *—

ఈ రీతి తమ యింట ఇలువరుసయని పలికి మరి మరి తమతోడ
మనవి చేయుదును - ఇలువరుస నడపదు లిలలోన నెవరైన తప్పింపజా
లరు ఒప్పకుందురుగా - ఘనముగాతిమవిద్య ఘనచిత్తమందున చింతిం
చివేగమె సెలవియ్యవలెను - ఈరీతి బ్రాహ్మణులు నేరుపున బలుకంగ
ఆరాజదేవేంద్రు డంతరంగమున - కడుప్రొద్దుచింతించి గ్రక్కునను పలి
కెను విప్రపుంగవులార వినరయ్యమీరు - రాజులారాజు రాజధర్మాం
గుడు ఆరాజు వియ్యమందుండుటే మేలు - నడవడియెట్లున్న నాకుతోచి
నమాట సుందరినియిచ్చుట సూటియేయనియె - అనుచు మంత్రులబిలచి
ఆలోచనలుచేసి నిర్ణయపుజాబులు నీతిగావ్రాసె - ఆజాబులే చూచి
అచట ధర్మాంగుండు తనమంత్రినే చూచి ఘనముగాబలికె - నిర్ణయపు
జాబులు నేడు మనకునువచ్చె లగ్నము నేర్పరగు లగ్నపత్రికను - బనిబట్టి
వ్రాయించు పంపించుమరివేగ తడవుసేయక మనము తర్లిపోవలెను -
అనుచుబ్రాహ్మణులతో నతివేగమునమీరు పట్టనున లగ్నంబుపరికింపు
డనగ-భూసురోత్తములెల్ల పొందుగా గుమిగూడి పంచాంగములువిప్పి
పరికించిరపుడు - కార్తీకమాసమున కడుశుద్ధపంచమిగురువారమునందు
కుంభలగ్నంబు - చిత్త నక్షత్రంబు చెప్పబడుచున్నది చంద్రతారాఫ
లము చాలబాగుండె - వేధక్రాంతులు లేవు మోదమున పరికింప ఘన
ముహూర్తంబిది మంచిదేయనుచు.

—* పురోహితులు వివాహలగ్నమును నిర్ణయించుట. *—

విప్రు లారాజుతో వేడుకను జెప్పంగ అప్పుడె వ్రాసెరి ఆశ్చర్యము గను - తిథివారనక్షత్ర విధులెల్ల వ్రాసిరి లగ్న రాసులు చాల రాజసంబు గను - రాజుగారీతి లగ్నపత్రికబంపి అలరగా తిగపెండ్లి యత్నమున నుండె - ధర్మాంగరాజట లగ్నపత్రిక జూచి తమవారితో జెప్పితక్షణము లేచి - తనమంత్రినే బిలచి తక్షణము మనపురము ముస్తాబు చేయుమని ముందుచాటించి - తరువాత మీరంత తగు పెండ్లియత్నములకుతగినబందో బస్తు తగచేయవలెను - లగ్నంబుదరియయ్యె రభనమునతి వేగ పందిళ్ళు శాలలు పరగవేయించి - చుట్టాలకును వేగ శుభలేఖ వ్రాసిమనసకల యత్నములును సరిచేయవలెను - అని రాజమంత్రులు అతియత్నముని వరుని అచట ధర్మాంగుండు నామంత్రివరుడు - చుట్టాలబంధువుల నూటి గారప్పించె పెండ్లీయత్నములపుడు వేగచేయించె - పురము శృంగారించి పాలుపొందనొకవింత మరిమేళతాళములు మానుగా గూర్చె - ముందు ఆగాడిని పొందుగాడేరాలు వేయించుమనిపంపె వేగకొందరిని.

—* ధర్మాంగిరాజు కత్తిని తర్లించుట. *—

అపుడు అంబారీలు అవుదాలు కట్టించి చుట్టముల రప్పించె నూటిమీరగాను - సొగసైన మరిగొప్ప జల్మల గుఱ్ఱాలు వేలకొల దిగముందు వేగనడిపించె - అందంబులు మంచి పొందైన పాలకీల్ మఱికొందరికినిచ్చె మానుగానపుడు పాలకీ మేనాలు లక్షవేలిచ్చెను బంధువుల నడిపించె భాగుమీరగను - సింహతలాటముల్ చిత్రించె దొట్లకును ఆతపల్లకివారు అపుడు దెప్పించె - తమచేతి కత్తికిని తగ స్నానమాడించి ముత్యాలబాసికము మురుపుగాగట్టి - పట్టుపరుపుల మీద పల్లకిలోనుంచి సింధూరతిలకంబు చినరనుంచిరిగా - భేరీడమామాయిలు పెద్దబూరలుమోగ్రి తగకత్తినే వారు తర్లించిరపుడు - ఈటెకట్టెలవారు ఇరువైపులను గొలువ తురుపుగుఱ్ఱముచుట్టు మరి నడువగాను - దొరలు సామంతులు బిరుదు గొడుగులుబట్ట మనరా జులఫౌజు మరిచుట్టునడుప - ఈరీతి పెండ్లికిని ఎలమిగా జరిపించి తన మంత్రితోబల్కె ధర్మాంగదుండు - నీనేర్పు ప్రతిజ్ఞయు నేడుగనబడు లాగు ఇంతిని దేవలెను ఇకజెప్పనేల - మంత్రికిని రాజట్లు మరిసెలవు లివ్వంగ సెలవంది యామంత్రి యెలమిగానపుడు - అద్దాల పల్లకిలో అపుడు తాగూర్చుండి తర్లించుకొనివెళ్లె తనకత్తి నపుడు పెద్దపెద్ద ఢంకాలు పెంపెగా నడపించె మఱివేగమున జేరె మాణిక్యపురము -

పట్టంబు పై గాను పట్టుమేనాలును వేయించి జనమెల్ల వీలుగా దిరిగి పెండ్లివారలురాక పేరైన రత్నాంగ రాజువారికి కబురు రయముతో బంప - ఆకబురువినగానె అతివేగముం రాజు తనమంత్రివరులను తగ బిల్వబంపి - పెండ్లివారికి మీరు ప్రేమతో నెదురేగి వేగతోడుకరండి విడిదికీవేళ - అని రాజు చెప్పంగ ఆమంత్రివరులపుడు సకలసంభ్రమను లతో చాల వేంచేసి వెళ్ళి వారిని చాల - ప్రేమతో మన్నించె ... నికివారు వేగరమ్మనగ - ఆమాటకును వారు అతివేగము... మృదంగాలు భోరుమనిమోగియ - తమ్మటంబులుపెద్ద తావ... లును రవడోలుడక్కిలు రభసమున మ్రోయు - న్న వాద్యంబులును యేకమై చెలగంగ తర్లించుకొనివచ్చె తగక త్తినపుడు - భోరుమనినా దంబు ఘోరముగ పురినిండె అప్పుడా పురజనులు ఆనందముగను - పెండ్లివారలరాక ప్రేమతో జూడంగ తమగృహంబులువెడలి త త్త రంబుగను - చెంగావిచీరెల చెంగులే వీడంగ రవికముడులువీడి రభ సంబుగాను.

—* పురస్త్రీలు పెండ్లికొమారుని చూడవచ్చుట. *—

కొప్పులే వీడంగ కుచము లల్లాడంగ నడుములేయసియాడనవ కమలరగను - వయ్యెదలు జారంగ పరుగెత్తివచ్చిరి కాళ్ళనందెలు ఘల్లుఘల్లు మనగాను ఆడవచ్చు స్త్రీలు ఆపెండ్లివారపుడు కరువులు దీరంగ గనియిట్లులనిరి - మాణిక్యబొమ్మలో మరుని పూములుకులో వీధియందముజూడ వింతయే యనిరి - యీలాటి వింతలు యిటనుండ గాబోలు మాణిక్య పురమని మనిపేరు గలిగె - పేరుకన్నను మిగుల తీరుగనపడుచుండె పట్ణంబు పద్ధతులు పరగనొకరీతి - ఈ రీతిగావెళ్ళి వారంత భ్రమనొంది పల్లగీ చుట్టున్న పరుతులనుజూచి - పెండ్లికొడు కునుజూచు ప్రేమతో వారలు ఒకరిమీదను ఒకరు వంగిచూచుచును - అటుతిరిగి యిటుతిరిగి యెటుచూచిననుగాని కత్తికనబడెవారి కండ్ల కంతటను - ఇదియేమియోయక్క యిదియేమియోచెల్లె కత్తికేబాసి కము గట్టెపారమ్మ - ఇదియేమిమాయమో పెండ్లికొడుకులేక పెండ్లి యెట్లగును - యీలాటిపెండ్లినే నేలోకముననైన కనలేదు వినలేదు కలిగిభువిలోన - ఒకరిమొగముల నొకరు వనిత లటుజూచుకొని తమ లోన తమరిట్లు తలపోసికొనిరి - అందులో నొకప్రౌఢ అందరును విను చుండ వార్థితోడనుబలికె నేరుపలరగను - వనితలారా మీరు ఒప్పుగా వినరమ్మ ఇదిమాయపెండ్లియే యిది నిజముగాను - ఎంతజేసినమాయ

ఇలపతులుజేతురు పాపకార్యంబులకు పాలుపడుదురుగా - పూర్వకథ లను మీకు పొందుగా జెప్పెదను వినరమ్మ మీ రింత వేడుకలరగను పుడమిలో ప్రఖ్యాతి పుష్కరుండనురాజు మాయబూటకాడి మహి మగల్పించి - పతిభార్యలిద్దరకు నొకచీర గట్టించి నలరాజునేనంపె నా డు అడవులకు రాజులరారాజు రాజు దుర్యోధనుడు కపట జూదంబాడి కనికరములేక - పంచపాండవులను వంచించి అడవులను పదునాలు గేడులు పంపెనా లేదా - శ్రీరామచంద్రుండు సీతను వెనుకుచును పొంచి యావాలిని దునిమెనా లేదా - తగలంక గుట్టంత తగరాము నకుచెప్పి అన్నను జంపినచె నా విభీషణుండు - శనిరాజు మాయచే ఘనహరిశ్చంద్రుని సకల బాధలుపెట్టి జగతి లోపలను - ఈలాగు నొకవనిత యిలచాటువులుచెప్ప మరియొక్క చెలిపలికె మానుగా నపుడు - మగవారి మాయలను మగువ జెప్పకిపుడు ఆడువారిమహిమ పతివవిన్నావా - మగవారి సెలవున కుంతి మరివెంట ముగ్గురికి పెండ్లి యగుటను మునుపువెళ్ళె నొక మనువు - అతిపతివ్రతలంచు అవనిలో జెప్పుదురు ఆదిపర్వపుకథ లాలించలేదా - పంచపాండవులకును పడ తిద్రౌపదియనగ నొక్కతె మని పెనట నొప్పుగానమ్మా - ఘనపతి వ్రతలంచు జనులు పొగడెదరిపులు భారతము మాధవుడు పరికించ లేదా - కన్యప్రాయమునాడు కాంత మండోదరి ఆ వాలితో పొంది యంగదుని కనెను - తర్వాత రావణుని తనభార్య యామెను వారిత ప్పలుపట్ట వశముగాదమ్మ - గౌతముని భార్యయగా ఘనురాలహల్య యు ఇంద్రునితో గూడెనని యుంతి వినలేదా - పరమపురుషు నింటనే పదినెలలు తానుండి మగుడి యయోధ్యలో మఱి రాముగూడి - కాపు రంబుచేసి కనెను లవకుశులను చిన్ని బాలుర నప్పుడు శీతయనుదేవి పంచకన్యలువార లెంచగ లేరెవరు మనము ఆలాగైతె మరి చెప్పగ గలరా - ఈలాగు నొకవనిత ఇలచాటువలుచెప్ప మఱియొక్క కాంత మామగా బలికె - మండలాన పురిలో మఱి యొక్కటియు గలదు వానివరుసలులేవు వనిత విన్నావా - గొప్పయింటనుబుట్టె యొప్పుగా సుభద్ర అన్నైన కృష్ణుని అపుడు పెండ్లాడె - అవనిలో ప్రఖ్యాతి యపుడు రాధాదేవి అల్లునుంచుకొనె నతివరో వినవె - కొమహొప్ప శిష్యుని కూడదనగా తార చంద్రునిగూడినది చెలియ వినలేదా - ఈ లాటివరుసలు యిలపతుల యింటను మరి పెక్కులున్నవి. మాటలవి యేల - అనుచు పునజన్మలపుడు ఆలీలగా బలుకు తెర్లించుకొనివచ్చి

తగకత్తినపుడు - పేరైన విడిదిలో పెండ్లి వారినిడించి రత్నాంగధరుడపుడు. రాజసముఖము గలుగ - రత్నాల పీటలను రయమొప్ప పరికించి పెండ్లి యరటాకులే వేయించి రపుడు - పిండివంటలు మిగుల పేరైన కూరలు రచ్చల్లు వడియాలు హెచ్చుగా దెచ్చె - సన్నని యన్నములు కాయపప్పులు నింక సకల పదార్థములు చాల వడ్డించె - పెండ్లి వారిని వేగ పిలుచుకొనివచ్చిరి కాళ్ళకును నీళ్ళిచ్చి కావింపి ట్లు - కూర్చుండ నియమించి కొదువలేమి లేకుండ పంక్తి తిరిగి పరికించుచూచి - నేతులే మరి తెచ్చి చేతులను దిగజార చివారపుడు వనితలందరును - ఆరీతివడ్డింప నారగించుచునుండి ఆపెండ్లివారంత ఆనందముగను - పసిడిపళ్లెముల పణతులే దెచ్చిరి మారు విడియసేయ మరి పదార్థములు - గుకుకుచంబులపెట్ట కొంగులేదిగజార పంక్తిపంక్తికి దిరిగి పణతులందరును - తొలింపు సోలింపు వాలుచూపులతోడ పసిడిపళ్ళెములతో వడ్డించిరపుడు - తప్తకాంచన కాంతి తళుకొత్తుమేనున మెఱపుతీగెలలాగు మెరసిరానతులు - వారి వన్నెలజూచి మతిభ్రమను జెందిరి మరి పెళ్ళివారు - ఒకటిపలసివేరొక్క తెన్నుసభోయి మరిగొకటి మరియొకటి మరి పిలుతురమ్మా - ఏమి కావలెననుచు యింతులను అడుగంగ మరియేమి లేదనుచు మరుగు పెట్టుదురు - మొగమును జూడంగ ముచ్చటతోచాల పనిలేకపిలుతురా పద్మగంధులను - సరస సల్లాపముల చాతుర్యములతోడ మగువలతో గూడి మాటలాడుదురు - రత్నాంగదుని యింట రత్నంబు నున్నట్టి తళతళతళ మెరయు తరుణు లొడ్డించి - ఈరీతి వడ్డింప నెలమిగామరి పెండ్లి వారంత తుష్టిగా నారగించిరిగా - గఱుగఱుగఱుమని గ్రక్కునలు మత్తించి చేతులనుగడిగి మరి చెలగి వచ్చిరిగా - పసిడి చెంబుల నీళ్ళు పణతులే వడ్డింప హస్తములుగడిగిమరి అతివింతగాను - రత్నాల పళ్ళెముల రాజు రత్నాంగదుడు విడియంబు లందిచ్చె వేగమందరకు తరువాత నా రాజు తడవుసేయక వేగ కాళ్ళగొలుసున గలుగ ఘన కార్యములను - అతివేగచేయించి అప్పుడొప్పుగ పెండ్లి వారికే కబురంపె కోరికలుదీర - సందెలగ్నము గనుక మఱిజంపు సేయక తర్లిరావలెనంచు తగకబురులంపె - కబురు విని వారలు కడువేగమున లేచి దీపములు దివిటీలు పరగ వెలిగించి - పెండ్లిపల్లకియపుడు ప్రేమతో సెత్తిరి భేరిమృదంగాలు భోరుమనిమ్రోయ - చెప్ప శక్యముగాని చక్రింబులేకాలె చిచ్చుబుడ్లుగసె చిత్రింబుగాను - ఆ కాశమున

దూసె ఆవలదూసెనో యన గహ్వరములేదు యెగ్గిరి యిమ్మనగా -
యిమ్మగా పదివేలు కొమ్ములే కావలెను పూలవానను బోలి పొలుపు
మీరగను - మరి తెరపి లేనట్టి ముత్యాలులేకాలె పట్టణమంతయు పట్టు
పగలుగానపుడు - బల్లకట్టులమీద భాసిల్లగను మేజువాణీలు చేసిరివార
కాంతలును - సకల సంభ్రమముల శంఖాలు పదివేలు ఘల్లించి తెచ్చిరి
తగకర్తినపుడు నీటుగా బురజనులు నివ్వారి బట్టంగ వరహాలు మొహ
రీలు పదులకిచ్చిరిగా - ధర్మాంగదుడన్న ధరణిలో ప్రఖ్యాతి పోకుండ
నిప్పించె బురజనుల కపుడు - యీ రీతిగానిచ్చి యెలమిగా మరి సింహ
ద్వారంబు వాకిట కోరికలు మీర - స్వర్ణైన రత్నాల పెండ్లియరుగుల
మీద పసిడిపీటలు వేసి బాగు మీరగను - కర్తినట టనువుంచి నట
హోమములుచేసి శాస్త్రపద్ధతి విధులు జరిగించి రపుడు - కర్తి తరపున
మంత్రి గర్తవ్యమునకును శతమానమేగట్టె సఖియమోద నపుడు - కర్తి
చేతనుబట్టి కరమొప్ప ముత్యాలు తలంబ్రాలుబోసెను తగమంత్రియపు
డు - పెండ్లికూతురిచేత ప్రియముగా ముత్యాలు కర్తికి వేయించి
కాంతలందరును । వారితరపున వీరు వీరితరపున వారు గోసిళ్ళతలంబ్రా
లుపోసిరావేళ । యీరీతి తలంబ్రాలు నింపొంద పోయించి చుక్కజూ
పించిరి సుందరికి నపుడు । తీయుదురు రోజులపెండ్లి యీవరుస తప్పకను
పెండ్లిచేసిరివారు విఖ్యాతిగాను । ఆఖరురోజున నాగవల్లియు జేసి అపు
డు వసంతాలు అతిమోదమునను । వారిమీదను వీరు వీరిమీదనువారు
జల్లులాడిరి యెంతో సరసమలరగను । ఆరీతిగను పెండ్లి ఐదురోజులు
నడువ తరువాత నా మంత్రి తగపయనమాయె । రత్నాంగ రాజపుడు
రాజసంబరంబుగ కట్నంబు లిప్పించె ఘనమంత్రి కపుడు । సొగసైన
త్రైలోక్య సుందరికి నప్పుడు దాసి దాసాదులకు ధనములిప్పించె । పాడి
పశువులుగూడ పదివేలు నిప్పిచ్చె గుఱ్ఱాలు యేనుగులు గొప్పగా
నిచ్చె । మొహరీలు మాడీలు బహుకోట్లు తానిచ్చె సుందరికి నావేళ
సూటిమీరగను । తల్లిగారునుచాల తనచిన్నిసుందరికి బుద్ధులు చెప్పంగ
బూనె నావేళ । నాతల్లి నాయమ్మ నాముద్దుబాలవో నాచిన్నరత్నమా
ననుగన్నతల్లి । చిన్నారి పొన్నారి చిన్నముద్దులగుమ్మ నను విడచి వెళ్ళె
దవు నాతల్లికూన । అత్తమామల మాట అడుగుదాటకరాదు పొరు
గిండ్ల కెన్నడును బోరాదుసుమ్మా । వదినెమరదుల నెల్ల వావివరుసలచేత
ఏమాటలన్నను యెదురాడబోకు । మఱదులు బావలను పరిహాసము
లుచేయ చిన్ని బోరాదమ్మ చిన్నారి చిలుక । పురజనులు యెవ్వరైన

పొలతిజూడగాను యెదురేగరాదమ్మ నిలిచుండవలెను । పతికన్నముం దుగా పవ్వళించగరాదు పతిదైవమని చాల భావించవలెను । సూర్యో దయమువరకు సుదతి పడుకొనరాదు పలువిచ్చి పలుమారు పలుకంగ రాదు । పతికన్న ముందుగా సతి భుజింపగరాదు పతిమాటకును మారు పలుకంగరాదు । మాకు అపకీర్తులు మఱితేకుమోయమ్మ మాకుకీర్తులు తెమ్మ్మ మా చిన్ని చిలుక । సొంపుగా త్రైలోక్య సుందరినామగ వాడుక సుమ్ము లోలాక్షీ నీకు । వాడుకలు పోకుండు వసుధలో స్త్రీలకన్న మగుల చెలువు కదమ్మ । పుట్టిళ్ళు యెరుకమ్మ పొలతి - ధరలోన ఆ త్రిల్లు నత్యంబు అబలలకు నిజము । ఈతీరుగను బుద్ధి యిం పొందజెప్పు చును మంత్రితో బల్కిరి మానుగా నపుడు । ఓ మంత్రిపుం గవా ఓగుణధీరుండ నీమాటనమ్మి మా నెలతని స్తిమి । మీ రాజు మీ యయ్య మీ పెత్తిల్లికొడుకును మేముచూడగలేదని మహాత్మ్యమున । అదిగాక సుందరిని అప్పగించితి మిపుడు ఇదివరకు మాపట్టి యిపుడు మీపట్టి । మీరాజువారితో మామనవిగా మీరు మళ్ళిచెప్పండి - ముద్ద రాలుబాల బుద్ధులె మెఱుగును కనుక నేలాగైన గడుపుకొండనుచు - ఆమంత్రిచేతిలో నబల హస్తముబట్టి అప్పగించిరివారు అతివింతగాను - వారికన్నులవీరు వరదలై పారంగ తల్లిదండ్రులకు చాల దండములుబెట్టి తగుపెద్దలకునెల్ల దండంబులనుబెట్టి అతివలందరియొద్ద నపుడు సెలవంది ఆవలీలలు చెలులు హస్తములుబట్టుకొని తీసుకొనివచ్చిరి దేవిడిదరికి - రత్నాలపల్లకిలో రమణీ కూర్చుండెను బంగారు బొమ్మవలె భాసిల్లెనపు డు - ఆభరణములతో అతివసుందరినపుడు అంపకము జేసిరి ఆతల్లిదండ్రి భేరీమృదంగాలు భోరుమని మ్రోయంగ తర్లించె నావేళ తగమంత్రి వరుడు - కత్తిపల్లకిముందు కాంతపల్లకివెనుక నడిపించె నావేళ నాణ్యా మలరగను - అంతింత మజిలీలు వింతగానడిపించి శీఘ్రముగతనపురము చేరువకునేగె - పెండ్లివారలరాక ప్రేమతోడనువారు తగుదాదులంపిరి ధర్మాంగదునకు - ఆకబురువినగానె ఆనందమునుబొంది తగిన సంభ్రమ ముతో ధర్మాంగదుండు - ఎదురుగావేంచేసి ముదమొప్పమంత్రిని అతి మన్ననుజేసి హితవుమీరగను - ఓమంత్రిపుంగవా ఓకీర్తి గుణధామ సుందరిని దెస్తిని సూటిమీరగను - నీనేర్పు ప్రజ్ఞయు నేడుకనబడులాగు బాలనిటుదెస్తివి భాగుమీరగను - మంత్రిపుంగవు నిటుల మన్ననలు కావించి మఱిమంచిదేయంచుమంచిదేయనుచు - సకల సంభ్రమయుక్తి సానిమేళములతో త్రైలోక్యసుందరిని తరలితెచ్చిరిగా - పెండ్లికూతురు

సపుడు - పి్రియముతోచూపుమని కనకాపురము ప్రజా కళవల్పడీరి - పడుచులెచూచువారు పరుగెత్తివచ్చిరి పసిడిబొమ్మలలాగు భాసిల్లిగాను పురజనులు ఈరీతి మజిచుట్టుకొని నడువ తీసుకొనివచ్చి దేవిడీదరికి - ఎఱ్రిపచ్చరత్నాలు ఇంతులే దిగదుడిచి పారవేసిరి వారు బాజుబాజులను - సొగసైనత్రైలోక్య సుందరికి సప్పుడు చేతులారలనిచ్చి చెలులు దెచ్చిరిగా - మెఱపుమెఱుసినట్లాగు మెలతతా వెడలసే పల్లకిలోనుండి బహువింతగాను - చూడవచ్చిన యట్టి సుదతులందరు చేరి మణి భ్రిమయుజెంది నదిమజిచెప్ప నేల - దిగ్గునండ్లకును చీకటులు కప్పెను చూడ జాలకవారుసొమ్ముసిల్లిరిగా - ధైర్యంబుదెచ్చుకొనితిమనో సతముపురము వర్ణింపదొడగిరినంతటను - ఇదియేమియోయక్క ఇదియేమిచెల్లెలా ఈలాటిసుందరము ఎన్నడెరుగముగా - తీర్చిప్రాసినయట్లు దిద్దిచెక్కినయట్లు యీబాల సౌందర్య మింపొందుచుండె - ముల్లోక సుందరిని మొదట పేరుంచినా వారంత నేర్పరు ల్వర్ణింప తరమా - పేరుకన్నను మిగుల తీరుగా నున్నవి ఈరూప మీరేఖలిపుడు చూడంగను - ఈచెలశృంగార మింపుగా చూడంగ యతులకైనను కాముతగుల బొడమునాపు సుదతిరో యీబాల సౌందర్యమునుచూచి సన్యాసియైనను సంసారగాడే - ఈవన్నెయీచిన్నె యిపుడు పరికింపంగ - యమదూతలైనను ఆశపడరటవే నెలతరో యీబాల నీ తీరు చూచినను గడుసువారికగూడ చెడిపోవు మనసు - బాలతులను జూచితే ఋషులకు భువిలోన ప్రీతిబుట్టుట నిజము పేదలకునైన - ఈబాలచందంబు నిపుడుజూచినయట్టిస్త్రీలకే భ్రమబుట్టె చెప్పసిగ్గౌను - అంతచక్కనిబాల యేయింట నుండినను కలవెందుకుందును మరివారికేల - ఎన్నెన్నిజన్మము లిక మనము యెత్తినను ఈలాటిసుందరిని యిక జూడమమ్మ - మనరాజు కొడుకును మనముజూడగలేదు గోడలను చూస్తిమి కోరికలరగను - ఈతీరు బురజనులు ఆశ్చర్యముగ పలుక సొగసైనత్రైలోక్యసుందరియునపుడు - అత్తగారికిమొ్రొక్కి అతి భక్తిమీరంగ మజిపెద్దలకుమొ్రొక్కి మారుగానపుడు - మ్రొక్కగానే యత్త ముదిటకౌగిటజేర్చి కోడలినిముద్దాడి కొంతదీవించె - అలయురుందతియటు అమలతనముగలిగి వసుధలోనిపుడు వర్ధిల్లుమమ్మ - శచీదేవి యింద్రునిచందమున వర్ధిల్లిపుత్త్రిసంతానంబుహొందువుగాక గౌరీశులను బోలి ఘనమైత్రియును గలిగివర్ధిల్లవలెనమ్మా వసుధలోపలను - అర్మిలీ దేవియును అపుడు దీవెనలిచ్చి కోడలను తీసుకొని వేడుకను జనియె - అత్తకోడలు నిటుల అంతఃపురముజేర యెవరి యింటివారు యేగిరంత

టను - తరువాతిసుందరియు తగభక్తిమీరగ అత్తమామలవద్ద అనుకూ
లమయ్యె - తల్లి చెప్పినయట్ల తగిన భయభక్తులను అత్తింటమసలుకొనె
అపుడు సుందరియు - తనతోడి చెలులతో తానుఘనముగనుండె ఏవిధ
ము నడవడియు నెంచిచూచినను - లోకవిఖ్యాతి లోలాక్షి సుందరియు
అంతట కొన్నాళ్ళు అతిభక్తితోను - ఈతీరుకొన్నాళ్ళు యింతికెపుడు
గడుప పట్టశక్యముగాని ప్రాయంబువచ్చె - తీరైనకన్నులను కు
లుబుట్టె నడత మఱియొకవింత నడక మలరగను - నడుము సన్న
నాతిమైతిగ నుడు పసిడిచాయలు మించి భాసిల్లుచుండె - రతిబంధములు
చాల ప్రాయబడియున్నట్టి చిత్తిరువులనుచూచి చెలియ నవ్వుచును.-
పతిసతియునున్నట్టి పద్ధతులు తాజూచి తనపాటి చెలులతో తాను నవ్వు
చును - పట్టశక్యముకాని ప్రాయమున కన్నులను పొగరెక్కి యాబాల
మిగుల దుఃఖించె - పతినిచూచెదనన్న భావమున మదిలోన వెదకుచునుం
డును యింతివింతగను - మేడలు మిద్దెలను దుంచు చావడివెంట సందు
లనుగొందులను సకలగేహముల - ఇరుకు మరుగులు వెదకి యెచ్చోట
కానకను తనలోన తానపుడు తలపోయుచుండె - ఇదియేమిమాయయో
ఇదియేమివింతయో నేనువచ్చినది మొదలు నేటిదాకయును - మాటైనవిన
లేదు మఱికండ్లగనలేదు తల్లియునుతండ్రియును తలచరెన్నడును - దాస
దాసీలను తలచలేదెన్నడును మా చిన్నరాజనుచు మఱియెవ్వరైన -
అని యిటులచింతించి అతిపసుందరి వేగ కల్ల నిజములు రెండు గానవలె
ననుచు - గుణవంతురాలైన కొమ్మనొక్కతె బిలిచి ఏకాంతమున తాను
యిట్లనుచుబలికె - నాయమ్మ నాతల్లి నాకుచెలిక త్తెవు నీకంటెచుట్టంబు
నాకెవరుగలరు - తల్లివైనను నీవె తండ్రివైనను నీవె తోడబుట్టువుగూడ
వేడుకలరగను - నేవచ్చినది మొదలు నేటిపర్యంతంబు కలికిరో నాపతిని
కనలేదు నేను - పరదేశమునకును బంపియున్నారేమొ తల్లితండ్రియును
దలచరెన్నడును - చుట్టాలుబంధులు చూడవచ్చిరి నన్ను వారైన నాప
తిని వర్ణించలేదు - ఏమిఏమిమాయమో ఇదియేమివింతయో నావిభుని
చందంబు నాకింక జెపుము - నాతల్లినాయమ్మ నాచిన్ని చెలియరో ఉన్న
దున్నట్లుగా నొప్పుగా జెపుమా - అటుపైని నాకర్మ మెట్లుగానుండునోతరు
ణిరో యెవరైనతప్పించలేరు - అనియిటులసుందరిని అతిదీనతనిబల్కచెలి
కత్తెయటుపైని జెప్పదొడగెనుగా - నాయమ్మ నాతల్లినన్నడిగితివిగనుక
వినవమ్మయమ్మ జెప్పెదను నీమలరగను - పొలతి నీపురుషుండు బుట్టబో
తయేతల్లి ప్రజ్ఞజూడగలేని ప్రజ్ఞగలవాడు నిండుపడగలుగలవు రెండునాలు

కలుండు మెలువు నడకలవారు నేలతనీమగడు - ప్రజలకీ భయంకరుండు
పేరునకు శేషుండు భూభారమెల్లను బూనగలవాడు - శ్రీవిష్ణువునకు పా
న్పుశివునికే కంకణమునాగలోకైక నాధినాథుండువాడు - వసుధలోజని
యించి వంటింటిలో మూలపెట్టిలో నున్నాడు పట్టి నీమగడు - విశదం
బుగా నిటుల విప్పిజెప్పినపుడు సుందరికి తెలియకను మాటిగా నడిగె
జెలికత్తెరో నీవు జెప్పినావే కాని నాకేమి తెలియదు గాతల్లి నాకూ
నా - అని యిటుల సుందరియు అతిదీనత బల్కి తిరిగి జెలియయు
నపుడు తేటగా జెప్పె - వినుము సుందరినీకు అనుమానమిక నేల అత్తవారి
నీవు అడుగవేతల్లి - నామగనిచందంబు నాకు జెప్పకయున్న ప్రాణంబు
విడుతునని బలుకవేతల్లి - రచ్చెక్కి సభలోన రాయభారంబేల వచ్చిచ
ల్లకుముంత దాచంగనేల - అనియిట్లు చెలికత్తె అడుగమని చెప్పంగ కా
లుగడగడవడక కడుసిగ్గునొంది - చెలికత్తెరో నీవు జెప్పినావేకానిఅత్తనే
మనుచును యడుగుదునునేను - అడిగితేనేమనునో అంటునమ్మ కొట్టు
నోనన్ను సిగ్గులేదనితిట్టి శిక్షించునేమొ - మామవారికి జెప్పి మావారి
కినిర్వాసి మర్యాదతీయునో మఱి బుడమిలోను - అత్తకును శాంతంబు
కత్తికిని నెత్తన కలదంటె యిలలోన కలికిరో వినవే - అని యిటుల
సుందరి యతిదీనతను బలుక తిరిగి జెలికత్తెయును తేటగా బలికె -
జారత్వమిదికాదు చోరత్వమునుకాదు నీవిభునినడుగుట నీకు తప్పగు
నా - దిట్టతనమున నీవు గట్టిగా ఖండించి భయపడక అడుగుము భా
మహోయనిన - ఆమాటకునులేచి అతివేగ సుందరి అత్తయుండెడిదరికి
యపుడు చనుదెంచి - అత్తరో మాయత్త ఆలింపుమనవి ఉన్న చంద
మునేను విన్నవించెదను - నేను వచ్చిన మొదలు నేటిపర్యంతంబు నా
విభుని గనలేదు నాభాగ్యమేమో - తల్లితండ్రులు మీరు తలచరెన్నడు
సుతుని దాసదాసీలను తలచరెన్నడును - పరదేశములకైన పంపించి
యుండిరో ఏ మాయెనో నాథు డెక్కడున్నాడో - ఉన్నదున్నట్టుగా
నొప్పుగా జెప్పండి చెప్పకున్నను నేను శీఘ్రంబుగాను - ప్రాణేశుకై
యిపుడు ప్రాణంబు విడిచెదను అనుమాన మికవద్దు అత్తరోవినుమా -
త్రైలోక్యసుందరియు తెంపుగా బలుకంగ అర్మిలీదేవపుడు అతివప్పై
వ్రాలె - కొంతసేపుకుతెలిసి అంతరంగమ్మునందు - చింతతో బలికెను
వింతగానపుడు - చెప్పిన నేమౌనో చెప్పకుంటేమౌనో యికనేమిసేతు
ననియిన్నంతిచింతించెను - ఇటుపైనఇక నేను మఱుమాయలుంచితే సుందరి
బ్రతుకదు ఎందుకీమాయ - అని మనసులో తాను అధికసాహసమున

కోడలా వినుమనుచు గొబ్బునను యేడ్చె - నాపూర్వ పుణ్యంబు నా భాగ్యమేమందు విశ్వంబులో లేనివింత కలిగెనా - నా గర్భవాసమున నాగరాజేబుట్టె పుట్టగానే మంత్రి పుడమిలోపలను - పుత్రుడనుచును వేగ పురములో చాటించె మటుమాయ కల్పించి మంత్రిపుంగవుడు - కత్తినుజూపించి కాంతరో నినుదెచ్చె యేమందు నేతల్లి యికజూడుమను చు - మూలనుండినపెట్టె ముందరికితాదెచ్చి కండ్లనీరొలుకంగ తాబలికె - కాంతరో నీవిభుడు ఫణిరాజు చూడుమని దాని ను దుట ధరణిపైడించె - పెట్టెమూతయుదీసి యిట్టట్టు కదలింప ఫణిరా బుస్సుమని పడగెత్తిలేచె - నాలుకలు గీయుచును నాతిపై నురుకంగ దబ్బునను సుందరి ధరణిపై బడెను - మొదలు తెగిపోయిన కదళికా తరువట్లు నిలుచున్న బాటునను నెలతపడిపోయె - తలకాయ తెగినట్టి తగరు మొండెములాగు తరుణి మూర్ఛయుజెంది ధరణిపై బడెను - కట్టుకడ వృక్షంబు ఒక్కు తెగిపడ్డట్లు సుందరియు చూచి నవ్వడు నేల బడెను - పడి యొక్కజామునకు పడతి మూర్ఛను దెలిసి దిగ్గునను తా లేచి గగ్గోలుపడుచు - అత్తగారినిచూచి అచటి చెలులనుచూచి గుండె పై మొత్తుకొని కొమ్మయెట్లనియె - అత్తయోమాయత్త అర్మిలీదేవనుచు పేరు జగతీగలదు ప్రఖ్యాతిగాను - నీవంటిపాపిష్టి యేలోకమున లేదు పాముకై నన్నిటకు పట్టితెప్పించితివి - నీయొద్ద నున్నట్టి నెలతనైనను కనికరములేదాయె కఠినాత్మురాలా - ధర్మాంగరాజైన తగదనక యీ లాగు పాపిష్టమగువనికి పాలుపడెనమ్మా - పూర్వజన్మమునందు పొలతి రోమీరిట్లు ఈలాటి కార్యములు యెన్నిచేసితిరో - ఆపాప ఫలమిదియె అదిమిమ్ము వదలకను ఈ జన్మమున మీకు యిట్లుగానుండె - నరుని గర్భమునందు నాతిరో యిదివరకు ఈవింతలేదెచట నెందైనకా - చెప్ప డు కథలైన చెప్పుకొనివినలేదు పాడుపుకథలైన పాడచూపలేదు-నాల్గు యుగములయందునడనళ్ళువిన్నను-ఈరీతి లేదుగాయెందైనకాని - బుధులు పండితులయినభువిలోననిదివఱకు ఈవింతచెప్పటను ఎప్పుడువినలేదు । ఏ జాతిగర్భమున ఆజంతువుపుట్టు ఇతరజంతువుబుట్టు ఇలలోనలేదు । యీ నాడు యీవింత యీ మేదిని జరిగె నెంతపాపిష్టులో యీ జగములోన । ఈవింత చూచినను యెంతమాత్రము నీకు బుద్ధి రాదయ్యెను పొలతియే మందు । బూర్వజన్మముతమకు పుడమిలోజూపెనని సిగ్గులేదాయెనిక జె ప్పంగనేల । నాయుసురు మీవెంట నాతిరోవదలగను పదునాల్గుజన్మ ములు పట్టిజరిగెనుగా । ఇదిఘోరపాపంబుయిదివద్దుతగదనుచుపురమున

కొకనైన పలుక లేదటవే । ఇంత కఠినాత్మకులు ఈ పుడమినుండంగ కన కాపురంబగుచుగలుగుపేరెట్లు । పట్టంబులోనున్న ప్రజలెల్ల నొకబుద్ధిపట్టి వ్రాసినట్టి బ్రహ్మనసనవలెను । పంచమహాపాతకుల పట్నమని జెప్పుటకు ఈపట్నమేకాని యిట్టిదికలదా । పామునకును మనిషికిని పరిణయము భువిలోన దగదనుచు ఎవరైన తప్పించరైరి । మాయమంగలిగొన్ని మహిలోన జెప్పుదురుకైక తాబుద్ధినిగల్పించెననుచు । రామరావణులకురణము గలిగించెనని చుప్పనాతి మహిమ జెప్పెదనుశొల్లి । అర్ధరాత్రిని తాను అనిరుద్ధుదెచ్చెనని చిత్రలేఖయునని జెప్పుకొంచురుగా - అవనిలోపల వారు అతిబుద్ధిమంతులని కథలు యీ రీతిగ బుధులు జెప్పెదరు - భేరీ మృదంగాలు భోరుమని మోగియంగ నెలమి రావణుతోడ అపుడు తరలిరిగా - పట్టపగలేమీరు దిట్టముగ కత్తికిని పెండ్లి జేసిరిమీరు ప్రజ్ఞ మీదౌను - మీమామప్రజ్ఞలకు మేదిని నీసరివారు నేర్పైనవాడైన నా తులికనేల - ఈసుందరముతోడ యిలలోన బుట్టించి బ్రహ్మనాకిపుడిట్లు పతిలేక జేసె - క్రిమికీటకాదుల క్రిందజన్మమునందు పుట్టుచును గిట్టుచును పొర్లుచుంటినిగా - యీనాటికినన్ను యిలలోన నీగొప్పనరజన్మనెత్తించెనలిగర్భుండు - పుడమిలోపల నన్ను బుట్టించెనే బ్రహ్మ విభుని సౌఖ్యంబులు యిపుడివ్వరాదా - పతిలేని యిటువంటి పడతియౌవనమేల పాటింప దీపంబు పగిదిగానుండు - విభునిసౌఖ్యము లేని వెలది శృంగారంబు అడవిలోపలనే - మళ్ళాడినటులుండు - పతిసతియునిద్దరును పవ్వళింపనిబ్రతుకు అడవిగాచిన వెన్నెలట్లుగానుండు - నాముద్దు ముచ్చటలు నాతిరోమీవారు చూడవలెనని మిగుల వేడుకలుయుండి - అల్లునికూతురని మంచిలగ్నములోన తీసుకొని పోదుమని ఆశతోనుండి - నావాంఛ ఆశలు నాయాశలనుగూడ బూడిదను పన్నీరు బోసినట్లాయె - దైవయత్నము లిట్లు తారనిల్పుచునుండ మనిషియత్నములెల్ల మటినిజములౌనా - దేవునిననేల దేవి మిమ్మననేల నాఖర్మఫలమిట్లునన్ను జెందునుగా - అదిగనుక అర్మిలీ అత్తరో వినవమ్మ నాకుతోచినమాట మీకుజెప్పెదను - నాకువిభుడైనట్టి నాగరాజునితోను దివ్యతిరుపతులెల్ల తిరిగివచ్చెదను - మంచిబిడ్డనుమటీ మారుచెప్పకు మీరు పాముపెట్టెయుదెమ్ము పడతినోయనుచు - త్రైలోక్య సుందరి తెంపుగానిటుబలుక అత్తఅర్మిలీదేవి యపుడు మూర్ఛిల్లి - కాంతగ్రక్కునలేచి కన్నీరులొలుకంగ సుందరితోడుతను సూటిమీరగను - కోడలా నీ విటుల గొప్పగా బల్కెదవు నాకేమితోచదే నాతల్లికూన - కొడుకవై ననునీవె

కోడలైనన నీవె నిన్ను నమ్ముకుంటిమి నీవటకు మేము - దివ్యతిరుపతులెల్ల
తిరిగివచ్చెదననుచు నేడుపలికితివమ్మ నెలతనాతోడ - తిరుపతులకు తిరు
గంగ తరులలకు వశమగున కొండలు అడవులును గొప్పనదులుండు -
ఘోరమృగములు గలవు చోరులును గనరమ్మ వాంఛకు వరములు
అదివట్టిమాట - మీ పేరుబెట్టుకొని యిల్లువెడలుదు విపుడు పామునొక
బుట్టలో పొరంగదోలి - వ్యభిచారివై నీవు వర్తించుటకు నిష
బొంకుబొంకితివి యిది నిజముకాదు - అత్తగారీరీతి అతికఠినముగ
సుందరియు మూర్ఛిల్లి సూటిగాబలికె - అత్తరో మాయత్త అవనిలోలే
నట్టి కఠినంబులాడెదవు కాంతతగునటవే - నామంచియుచెడ్డయు నామతి
యుదెలియకను యీరీతి బలుకంగ నోరెట్లువచ్చె - పంచభూతములెరు
గుపరమేశుడెరుగును నెలతనా నామనసు నీకేమి తెలుసు - ఫణివిభుడై
నట్టి పతితోడనేగూడి లోకమున తిరిగినను నాకుతప్పేమి - పతినిదైవము
గాను పాలించు నటువంటి పడతులకు తప్పౌన పరగభువిలోన - పతికి
మారాడిన పడతులిట భువిలోన కాకులైబుట్టెదరు కాంతరో వినవే -
పతికన్నముందుగా నతివభుజించిన యెడల కుక్కజన్మంబౌను కొమ్మ
రోవినుము - పవ్వళించినయట్టి పడతులే భువిలోన పందులౌదురుగా -
విభుడుచెప్పినమాట విననికాంతలు భువినికొండ చిలువలుగాను కొమ్మ
రోముందు - మగనికివెన్నిచ్చి మారునడచిన వెలది - గాడిదై బుట్టును
కాంతలతో నాధుడు బిలచిన మోదమున బలుకని దోసకారే విభుని
దాసరితాను యీలాగు యీలాగు మటికొన్ని యింతులగు నాకేమి
తప్పమ్మ నాతిరో వినుమా - పతితోడనేగూడి సతులు ముల్లోకములు
యేగితిరిగిననేమి నేదితప్పమ్మ - అనియిటుల సుందరి అత్తతో బలుకంగ
యీవార్త దాదులు యతివేగమునను - సభలోన కూర్చున్న జననాధు
నకు జెప్ప ధర్మాంగరాజపుడు తత్తరంబునను - మంత్రిపుంగవులతో
మరికొంత బుధులతో అంతఃపురముజొచ్చి అతిశీఘ్రింబుగను - అత్తకో
డలునిటుల అపుడు బలుకుచునుండ అచ్చోటికేతెంచె నా మహారాజు
మామగారినిజూచి మగువ సుందరియపుడు గుండుబాదుకొనుచు గోలు
మనియేడ్చె - కోడలీరీతిగా గోలుమని యేడ్వంగ ధర్మాంగదుండపుడు
ధరణిపై బడె - కొంతసేపుకు దెలిసి కోడలిని పట్టుకొని కౌగిటనుజేర్చు
కొని-కన్నీరులొలుక - నాతల్లి నాయమ్మ నా కోడలవుగావు నాకొడు
కనుకొంటి నాతిరోనిన్ను - యీకోట యీపేట యీ భూమి ప్రజలంత
నీవారలేసుమ్మి భావించిమాడ - నాపూర్వ కర్మమున నాగరాజేబుట్టె

నీవల్లనాకెదురు నెగడొందవలెను - కొడుకులు మరిలేరు కూతుండు శ్రీలే రమ్మ సర్వంబునీవమ్మ జగతిలోపలను - వేఱుబుద్ధులువలదని నెతి శ్రీ ధ శ్రీ మలునుమాని మాయింటనేయుండి మమ్ము రక్షించు - అలహరిశ్చం ద్రుండు నలరాజు పాండవులు రామచెంద్రుడు మొదలు ర జులెల్లరును - మొదట నిడుమలుబొంది తుదకు సౌఖ్యముజెంది రాజ్యంబు లేలిరా రమణులందరును - వారివలెనేమనకు వనజగర్భుడుతుదకు మేలుజేయును సుమ్మి నెలతనీచూడు - మంత్రిపుంగవు డిటుల మటువలాయ గల్పించి నిన్ను దెచ్చునుతల్లి నేనెరుంగనుగా - మంత్రిదన్ననేల నుఅదైన మను లేల మాకర్మ ఫలమిట్లు మాకు లిచ్చెనుగా - కర్మవశమున గలుగు కా మితానంబులు కర్మవశమున గలుగు కష్టసుఖములను కర్మవశమున గలు గు ఘనరాజ్య సంపదలు కర్మవశమున గలుగు కడురాజ్యపదవి కర్మంబు శుభమిచ్చు కర్మంబు జయమిచ్చు కర్మ మెవ్వారికైన కొంతదప్పదుగా మామగారిరీతి మారుగా బలుకంగ సుందరియును బలికె సూటిమీర గను - మంచిమాటలుమాకు మతిమీరుచెప్పితిరి మనసు సంతోషించె మతిచెప్పనేల - నాధుండు లేనట్టి నవ్యభూషణమేల పురుషులు లేనట్టి భోగంబులేల - మంత్రిపుంగవునిపై మతినింద చేసితిరి మీకు తెలియని పనులు లోకమున కలదా - రాజనుమతిలేని రాజ్యంబు మంత్రికిని రాణింపునేమిచ్చు రచ్చలోనుండ - అంతమాటకు మీరు అరమరసే యంగ అపకీర్తి యెట్లగునుఅవనిలోపలను - మామమిమ్మననేల మంత్రి నిలననేల గడచినపనికిని గడబిడియమేల - నాకర్మమిటులుండ మీకునీ బుద్ధులు శారదయుకల్పించె సరసంబుగాను - ఆలస్యమికనేల అతిచింత లికనేల నాకుతోచినమాట మీకు జెప్పెదను - నాకు పతియైనట్టి నాగ రాజునితోడ దివ్యతిరుపతులెల్ల దిరిగివచ్చెదను - పుణ్యక్షేత్రతిరుపతులు మాటిగా దిరిగెదను అటుపైన నా కర్మ మెటులుండబోనో అది గనుక నామనవి అతి వేగమున వినుడి సెలవిచ్చిపంపుమ శీఘ్రంబుగాన - యీ రీతిసుందరి దారుణంబులు బలుక గోలుమని యా రాజు కొంతదుఃఖించె కోడలా నీవిపుడు కులముద్ధరింతువని నమ్మియుంటిని వినుమి నా చిన్న కూన - నీవుపోయెదనన్న నేనేమిచేయుదును మమువిడిచి వెళ్ళుటయు మర్యాదకాదు - అడవులను కొండలను అతిదుర్గమంబైన నదులపాదలను గడప నాతులకువశమె-పురుషసాయములేక పొలతులకు భువిలోన తీర్థ యాత్రలుబోవ తీరుకాదమ్మ - అని యిట్లు మరికొన్ని అడ్డములు చెప్పినను మామగారినిజూచి మరియిటులబలికె - మామరో ఓమామ

మామ ధర్మాంగదా మళ్ళించనికనేల మమ్మునీవేళ - కొడుకులేకుండంగ కోడలింటనున్న ఆడికలు మరికొన్ని అపకీర్తులగును - పతిలేనియిటువంటి పతిని జూచినవారు వేరుచూపుదురయ్యా నెత్తిచూతురుగ - జీవితేశుడు లేక జీవించినన్నాళ్ళు పరీతిమాయింటకోరినేనుందు - అపకీర్తి మీకేల ఆతినిందనాకేల పోయివచ్చెదనయ్యా పుణ్యభూములకు - పుణ్యభూములు దిరిగి భూప్రదక్షిణ మేగి భూమినాథునిగూడి వేగవచ్చె ఏకచిత్తముతోడ నేలోకమేగినను సాంబమూర్తియె నాకు యుండు - నిజమూర్తితో నాకు గజరాజుగాచిన ఆదివిష్ణువునాకు సాయంబు సురలెల్ల సాయంబు పరమేష్ఠి సాయమో పరులసాయము లనుచునో మరినమ్మ నేల - పంచభూతములిపుడు యెంచగ సాయమా సూర్యచంద్రులు యిపుడు సాటిగానాకు - నావిభుండైనట్టి నాగరాజుండనగె ఇకనాకు సాయంబు నిపుడేల ననుచు దిగ్గునను తాలేచి దిశలెల్ల పరికించి అత్తమామలకపుడుఅబలతా మ్రొక్కి - పెట్టెదరికే తెనిచిచుట్టుముమ్మాటికి గిరగిరనుతాదిరిగి మరీ దండమిడెను - రెండుచేతులతోడ నిండుకౌగిటజేర్చి గ్రక్కునను తాపెట్టె నెత్తిపై బెట్టె.

—* సుందరి తీర్థయాత్ర వెడలుట. *—

మంత్రిపుంగవులార మరిబుధులువనితలుశీఘ్రముగమీరంత సెలవులివ్వండి - అనుచుసుందరియపుడు అతి తెంపుగానడువ గోడుమని వారంత గోలుపెట్టిరిగా - దేవిడీలనుదాటి దేదీప్యమానముగ రాజవీథులుగడచేరలగుమీరగను - పాలతినడుచుటజూచి పురజనులు యావత్తుపరుగెత్తి వచ్చిరి పురవీధిలోనికి - గుంపులనుగూడుకొని గుజగుజలుపోవుచును కాంతనొకతెనుజూచి కన్నీరులొలుక - తమలోనతమరపుడు తలపోయదొడగిరి స్త్రీలుపురుషులుగూడి వీలుగానపుడు - ఇంతచక్కని బాలకీ కిష్టమబ్బెను బ్రహ్మవ్రాసినవ్రాత బాయ దేరికిని - మంత్రిపుంగవు డీయుల మాయలనుకల్పించి బాలనిచటనుదెచ్చి బాగుజేసెనుగా - ఘోరపాపంబిది తగదుతగదనకను ధర్మాంగదుండపుడు తాతరలివచ్చె - రాజమంత్రులిపుడు రహస్యములుజేసిరి నొప్పింటినడువడికి తప్పువిలలేవు - యీలాటికృత్యంబు లిలజనులుచేసినను అదిమిశిక్షింపను అధికార్లువారు - కొండంత తమతప్పు కొద్దియానితరుల గోరంత తప్పును కొండసేయుదురు - అధికారతప్పులు కనలేరు యెవ్వరును ఈ ఘోరకృత్యంబులమీద గలదా - యీలాగుకొందరు వీనుగాబలుకంగ అందులోమరిపెద్దలపుడు ఇట్లనిరి - ఎందుకారాజును నిందింపపనిలేదు పూర్వకర్మంబిట్లు పొందునెట్లె

యిన - రావణాదుల ద్రుంచ రాముండు జనియించె కైకేసునునిందాయె
కానరాతొల్లి - కురుసేనకూలంగ దరియయ్యెకాలంబు శకునికి నింధాయె
చెప్పనేటికిని - ఘోరపాపము తాను కోరిచేసినయట్టి తొల్లిజన్మముకర్మ
మెల్లతప్పకను - కరమొప్పసారంగుకాలుచేతులుబోయెచిత్రాంగికిని నిం
ద శీఘ్రముగవచ్చె - యీలాగునిందలు నిలలో సమరి కొన్ని గలవనిబరి
కింప కారణంబేల । ఎవరికర్మవారి కెప్పుడును తప్పకను ఇందపై వార
లకు జెందుచుందురుగా । యీరీతికొందరు ప్రాకటంబుగలుక మరికొం
దరప్పుడు మానుగాదెలుప । యీలాటిభావంబు నిలలోన లేదయ్యెనొం
టరిగనాబాల వనముకేపోవా । రామావతారమున రమణిసీతాదేవి వన
వాసమేగినవాడు కందురుగా । రామలక్ష్మణులతో రమణి వెళ్లెనుకాని
ఒకతెనువెడలుట వార్తవినలేదు । నలరాజుపాండవులు నాహరిశ్చంద్రుం
డు మొదలైనవారలు ముదముతోడుతను । దంపతులుజతకూడి వనము
వెడలినరీతి చెప్పుకొందురు తొల్లి యెప్పుడైనాను - సీలాటిభావంబు నిల
లోన నెవ్వరికి లేదయ్యె చూడగా లేశమైనాను - పురజనులు యీలాగు
మరిమరియుదుఃఖింపవారివెనువెంటను నడువజొచ్చిరిగా - జనులెల్లయీ
రీతి తనవెంట నడువంగ పణతి సుందరియపుడు పట్టణముదాటి - మట్టిచె
ట్టుక్రింద మరిపెట్టియునుదించి తనతోడిచెలులతో తాబలికెనపుడు - నా
తులారానాకు సకలభూషణమేల రుద్రాక్షపేరులు రూఢిగాతెండి - అతి
సుందరంబైన అంబరాలికనేల కాషాయవస్త్రములు కడువేగదెండు.

—* సుందరి వైరాగ్య వేషమును ధరించుట. *—

అగరుగంధముయేల అతివేగమునదెచ్చి విభూతిబుయ్యారే వేగ
నాకనెను - అనియిటులదెప్పించి అతివేగసుందరికి కాషాయవస్త్రమును
కడువేగదాల్చి - మెడనిండవిభూది మేలుతాబూసి మెడను రుద్రాక్షలు
తడయకనుదాల్చి - చుట్టుకుదురుగబట్టి గట్టిగాతాజుట్టి నెత్తిమీదనుబెట్టి
వెలతగ్రక్కునను సూర్యచంద్రాదులకు సూటిగాతా మ్రొక్కి గగన
భూదేవులకు కడవేడ్క మ్రొక్కి - తలిదండ్రులను మ్రొక్కి తగవేల్పులకు
మ్రొక్కి నాగరాజుకు మ్రొక్కి నాతిగ్రక్కునను - పెట్టె గ్రక్కున నెత్తి
పెంపొందశిరసుపై చుట్టకుదురుమీద మట్టుగానుంచ - నలుదిక్కులను
జూచి నాతి అందరివద్ద సెలవందుకొని నడచె శీఘ్రంబుగాను.

—* తీర్థయాత్రా వర్ణనము. *—

ఇంద్రియంబులుద్రుంచి యేకచిత్తంబుగా పతిభక్తిమీదనే పణతి
కదెనుగా - చింతలునుమాని యెటుదిరిగిచూడకను ఉత్తరాదినడచె.

తత్తరంబుగను అడవులనుకొండలను అపుడుసుందరిగడిచె అతివేగమున నడచె. అబల తానపుడు - సింహాద్రిమలయాద్రి మేలైనమలయాద్రి ద్రోణాద్రిమొదలైన దొడ్డకొండలను - కులపర్వతములెల్ల కొమ్మ గ్రక్కున నడచి అతిఘోర వనములు అబల తాజూచి - ఒకటిరెండునుచూడు నొనరంగనా లేసి పదిరెండుదినములు పణతితానడచె - ఇదిరాత్రియిదిపగలుయిదిరా యముల్లనగ అతివేగమువనడచె యతివసుందరియు - ఈ నడచిహిమగిరికి తానేగి గంగపుట్టినచోటు గంగోత్రిచూచి - విష్ణుమునుండి వెడలినది యీగంగ భావనాకారనుచు పణతిగ్రక్కునను దండంబులను బెట్టి నిండు వేడుకతోడ పతిభక్తితోనందు పణతిమునిగెనుగా - స్నానంబుచేయంగ చలిచేతవడబడె ఒడ్డునున్నావాడు వనితనేదీసి మంటదరివుంచంగ వెంటనేవడదీరి దెలివచ్చి తాబాలదేవి చూచెనుగా నాగరాజునుజూచి నాతిసంతోషించె గంగనటుప్రార్థించి గ్రక్కునను నడచె - గంగనేధ్యానించి కడుదండములుబెట్టి అచ్చోటి తావెడలి అబల తామగుడి - అతివేగముననడచి అటహరిద్వారమున పట్టణంబుతా జేరిపణతియావేళ - పరమసన్యాసులును బైరాగునున్నట్టి మఠములె తాజూపు మగుపతానడచే - హరిమూర్తియున్నట్టి ఆలయముదరికేగివిష్ణుమూర్తిని దలచి నిష్ఠతోడుతను - సాష్టాంగదండములు చాలగా నర్పించి వేడుకొనెనావేళ మేదివింతగానూ - అలనాడుగజరాజ నాపదను గడిపిన ఆదివిష్ణువునన్ను అరసిరక్షింపు - మత్స్యావతారమున మరిసోమకునిదునిమి వేదములుదెచ్చినవేల్పు శిక్షించి కూర్మావతారమై కొండవీపునదాల్చి సురలకాచినతండ్రి యరసిరక్షింపు - రసరూపధరనీవు దయతోడరక్షించు దీనపోషకనాకు దిక్కునీవందు హరిమూర్తికీరీతి అతిభక్తితో మొక్కి అచ్చోటతావెడలి హెచ్చునడచే - బదరినారాయణము భామతా సేవించి బదరకేదారంబు పణతిసేవించి - బ్రహ్మకపాలంబు ఇమ్ముగా తాజేరి అచ్చటను స్వాములకునతిభక్తిమొక్కి - పదునెనిమిదక్షౌహిణి పౌజులుగూలిన ఆకురుక్షేత్రంబు అబలసేవించె - అచ్చోటనేవెడలి అతివేగముగనడచి చిత్రకూటమునేగి చెలియుగ్రక్కునను - ఒకరాత్రియచ్చోట నొప్పుగాశయనించి తులసి బృందావనము తొందరగజేరె - శ్రీకృష్ణుపూజించిస్థిరముగానింటింట పణతిగ్రక్కునజూచి దండములుబెట్టి కృష్ణవాసుదేవ కేశవపరమాత్మ అతివేగమున నన్ను కాచి రక్షింపు - పాంచాలిఆపనులు బాపినతండ్రిని కరుణించి రక్షించు పరమపావనుడ శ్రీకృష్ణహరికృష్ణ శ్రితజనపాలకా పతిదానమిప్పించి పరగనన్నేలు -

అనియిటులధ్యానించి వనితగ్రక్కునవెడలి అతివేగముగ నడచి అయో
ధ్యజేరి - సరయూనదిలోన సఖియస్నానముజేసి శ్రీరామకోవిలకుజేరిగ్రి
క్కునను - శ్రీరామజయరామ సీతాపతేరామ దానవాంతకరామదయ
జూచునన్ను ఇక్ష్వాక కులతిలుక ఇందిరాపతిరామ తారకాంతక
నన్ను దయజూడుస్వామి - యీరీతియనుకాంత సారెకును ధ్యానించి అ
చ్చోట తావెడలి అబలయైనడచె - ప్రయాగపట్టణంబు ప్రియముతో
డుతజేరి ఆలికేలి స్నానంబు సఖియ జేసెనుగ - అచటి స్వాములకెల్ల
భయభక్తితోమ్రొక్కి గ్రక్కునను తావెడలి కాంతతానడచె - బవ
నాశనీకాశి పట్టణముతాజేరి కాశిగంగాలోను స్నానంబుజేసి కాల
భైరవినపుడు కడుపెద్దసేవించి అన్నపూర్ణకుమ్రొక్కి నతిభక్తితోను
విశ్వనాథునిగుడికి వెలది గ్రక్కునజేరి సాంబమూర్తికితాను సాష్టాం
గపడెను - పదిచేతులను మొగచి పణతి తాజోడించి వేడుకొనె నా
వేళ వేయువిధములునూ - భూచక్రమే నీకు పొందుగా రథమయ్యె
గుఱ్ఱములు వేదములు కోరి చూడగను - కొమరొప్ప బంగారు
కొండనీకును విలువెల్లు జిహ్వాభోగి వింటివారా - అంబుజాక్షుడునీకు న
తిఘోరశరమయ్యె బ్రహ్మసారధియయ్యె బాగుమీరగను - సురలుబయ
లుగగూర్చి సూటిగా త్రిపురములు కడువేగదున్చిన ఘనుడ నన్నేలు
ఆదిరుద్రుడనీవు అప్రమేయుడవునీవు పార్వతీశుడనీవు పరగరక్షింపుహా
లాహలముమ్రింగి యమరులనుగాచిన దయశాలినన్నిపుడు దయజూడ
వయ్య విశ్వనాథుని యిటుల వెలదిస్తోత్రముజేసి కోటిలింగము లపుడు
కొమ్మయర్పించి - పంచక్రోశముదిరిగి పణతిగంగయుదాటి రామనగర
ముజేరి రమణిగ్రక్కునను - అచ్చోటవ్యాసునకు నతిభక్తితోమ్రొక్కి
తడయకఆవేళ తరుణినడచెనుగా - ఘనపట్టణముజేరి గ్రక్కుననుసుందరి
అష్టగయలనుదిరిగి నిష్టతోడుతను - ఫాల్గుణీనదిలోన పణతిస్నానముజేసి
విష్ణుపాదముచూచి వేగసేవించె । అచ్చోటుతావెడలి అతివగ్రక్కున
నడచి వైద్యనాథముజేరె వనితతానపుడు । అటనున్న స్వాములకు నతి
భక్తితోమ్రొక్కి మరునాడుబయలెళ్ళె మగువతానపుడు । కపిలమునియ
లనాడు జపముచేసినచోటు కలకత్తపట్టణంబు కలికిజేరెనుగా వేయుమో
ములతోడు వెలయుంగ నంబుధిలో గంగసంగమునందు కలికితామునిగి
సాగరంబును పదియు సాష్టాంగములుజేసి గంగకుతామ్రొక్కి గ్రక్కున
నువెడలి । పణతియూహారను పాలడిగిరిమరి తెచ్చి ఫణిరాజుకేపెట్టి పతి
భక్తితోను । తారసిల్లినయట్టి తగుఫలంబులు తాను భక్షించును వేగ

పణతితానడచె । కడువేగ నడచి కటకంబు తాజేరి రెండుమహానదు
లలో మెండ గాముని(గి । పొలతివేగనడచి భువనేశ్వరముజేరి యచ్చో
టస్వాములకు నబల(మ్రొక్కి । యచటనుండియు నడచి అతియు క్తితో
వేగ పురుషోత్తమునిజేరె పొలతి యావేళ - మార్కండేయములోను
మరి సీతగుండములో ఇం(ద్రద్యుమ్నములోనునింతితామునిగె । ఆ మహా
నదిలోను అంజలస్నానముచేసి ఆవటవృక్షమునకతిభక్తి(మ్రొక్కి ।
ముమ్మారు కొమ్మతావలచుకొని గర్భగుడిలోకేగి కాంత(గక్కు:న
స్వామికినిపది వేలు సాష్టాంగములు చేకొనెనావేళ వెలదివింతగను । శ్రీ
జగన్నాయకా (శితజనపాలకా భువనరక్షక శుద్ధబౌద్ధావతార । మధు
కైటబాదులను మదములణచినతం(డి శీ(ఘ్రముగజతగూర్చు (శీజగన్నా
థ । నీలాచలనివాస నిఖిల ఫలరక్షకా దీనపోషనాకు దిక్కునీవికను -
మరికొన్ని యీలాగుమనసులోనిడుకొని శ్రీజగన్నాథంబు శీ(ఘ్రంబునడ
చె । గంజాము ఛత్రపురి కడుమోదమున నడడె అమరపురమప్పుడును
అబలతానడచె । అతివేగముననడచి ఆదికూర్మముజేరి కూర్మగుండము
లోను కొమ్మతామునిగె - (పాకారముకుచుట్టు (పదక్షిణముజేసి గర్భ
గుడిలోచేరి కాంత(గక్కునను - శ్రీకూర్మనాయకా (శితజన పోషకా
శ్వేతచలనివాస శీఘ్రముగబోవు - మందరాద్రినిమెత్తి మరి సురల
గాచిన ఆదికూర్మావతార అరసి రక్షించు - మూర్తులునీవె మూడు
గుణములునీవె మూడులోకములకు మూలంబునీవె - పతిదాస మిప్పిం
చి పరగనన్నేలంగ దిక్కు నీవికనాకు దీనపోషకుడా - ఈలాగు మరికొం
త యింతితావేడుకొని ఆదికూర్మమువెడలి మోదమున నడచె - అరిసి
విల్లియుచేరి పతిభక్తితోడుతను సూర్యనారాయణుని సూటిగా(మ్రొక్కి
ఆశ్రీకాకోళంబు అతివేగమునజేరి నాగవలిదిలోన నాతితా మునిగె -
భీమేశ్వరునికపుడు కోటిదండముబెట్టి - ముఖలింగముజేరి ముదిత(గక్కు
నను - వంశావలినదిలోను వనితస్నానముచేసి ముఖలింగమూర్తినిమో
దములరగను - పదివేలుదండములు భక్తితో నర్పించె సఖియుతానడచే
ను సంగాముచేరి - మూడేళ్ళసందున ముదిత(గక్కునమునిగి సంగమేశ్వ
రు(మ్రొక్కె సాష్టాంగముగను - అచ్చోటనేవెడలి హెచ్చుగా తానడచి
రామతీర్థముజేరె రమణి (గక్కునను - రామగుండములోను రమణి
స్నానముజేసి గర్భగుడికేతెంచె కడుభక్తితోను - రామమూర్తిని వేగ
రమణీచేతులుమోడ్చి అతిభక్తితో మ్రొక్కె అతివసుందరియు - రఘు
కులాంభుధిసోమ రామావతారుండ హరిచాపఖండనా అరసిరక్షింపు -

ఖరదూషణాదులను మదమణచికూల్చిన శ్రీరామమూర్తినను శీఘ్ర
మునను బ్రోవు - బలశాలియగువాలి బలము నణచినతండ్రి ఆపట్ల నను
బ్రోవు మిందిరారమణ - కపిసేనతోనేగి కడలివారధిగట్టి లంకపైకేగి
నరామ నన్నేలు - రామమూర్తికినపుడు ప్రేమతోడుత మ్రొక్కి అచ్చో
టనేవెడలి అతిశీఘ్రముగను - పద్మనాభముసేరి పణతి అతివేగమున
కొండమీదనుయెక్కి కొమ్మసామికిని - పదివేల దండములు పణతితా
నర్పించి కొండగిరి శీఘ్రమున కొమ్మతా నడిచె - సింహాచలము వెళ్ళి
శీఘ్రమున కొండెక్కి హనుమంతు ద్వారంబు అబలతా నడిచె - గం
గాధారలోను గ్రక్కునను దామునిగి గర్భగుడికే తెంచె కాంతయా
వేళ - ముమ్మారు తాదిరిగి ముదితసాష్టాంగములు అతిభక్తితో మ్రొ
క్కిఅబలతా నపుడు - ఉగ్రనరసింహమై ఉక్కుస్తంభమునందు ఉద
యించితివి తండ్రి మదనజనకుండా - పరమభక్తుడైన ప్రహ్లాదు కాచిన
నరసింహామూర్తియిక నన్నేలుకొమ్మి - అప్పన్నకీలాగు అతిభక్తితో
మ్రొక్కి కొండదిగి నడచెనా కొమ్మగ్రక్కునను - అతివేగ ఉప్పాక
యబలగ్రక్కునచేరి వేంకటేశ్వర్లకును వేడుకతో మ్రొక్కి - అచ్చో
టనెవెడలి మరిహెచ్చుగా తానడచి ఒంటి మావడిదాటి వనిత యా
వేళ - శ్రీరామమునుచేరి శీఘ్రమున సేవించి సర్పవనములుచేరె
సఖియతానపుడు - తరుణియచ్చటి నెడలి ద్రాక్షారామును జేరి భీమేశ్వ
రునిమ్రొక్కి భామ యావేళ - అమర రామంబులు కొమరరామం
బును నంది గ్రామంబును నాతిసేవించె - పంచరామము లిట్లు పణతి
తాసేవించి కోటివల్లియు జేరె కొమ్మతానపుడు - మాతృద్రోహము
బాపె మఱి గౌతమీ గంగ - గోదావరిలోన కొమ్మతా మునిగె
సోమలింగమునను భామ గ్రక్కున మ్రొక్కి ముక్తేశ్వరము జేరె
ముదితతానపుడు - లక్ష్మి నరసింహుల లలనతా సేవించి ధవళే
శ్వరముచేరి తక్షణంబునను - సాంబమూర్తికి చాల సాష్టాంగములు
జేసి రాజమహేంద్రమువెళ్లె రమణియావేళ - కోటిలింగము నపుడు
కొమ్మతా సేవించి కోవూరు గోవూరు కోరిసేవించి - తరుణి అటుపై
నడచి దక్షిణాదినున్న తిరుపతులయావత్తు తిరిగి తామగుడి ఇంద్రా
చలంబును ఇంతితా సేవించి శ్రీవెంకటాద్రికి శీఘ్రమున నడచె -
శ్వేతాంద్రిసేవించి చాలివేగమేనడిచి భద్రాద్రికిని జేరె భామయావే
ళ - గోదావరిలోన కొమ్మ స్నానముజేసి రామమూర్తిగుడికి రమణి
తాజేరి - గుడిచుట్టు దండములు కొమహొప్ప మున్నూరు కొమ్మజావల

నూరుకోరి వివించె - సాష్టాంగదండములు చాలగానర్పించి వేడుకొని యావేళ వేడిదివింతగను - శ్రీరామ జయరామ సీతాపతే రామలోక పావనరామ నీకుదండములు - మూడుమూర్తులకెల్ల మూలమై నటు వంటి ఆదివిష్ణుడనన్ను నరసి రక్షింపు - పదునాలుగు భువనములు పాలించునాతండ్రి పతిదానమిప్పించి పరగనన్నేలు - ఈ రీతి మరికొన్ని ఇంతితా వేడుకొని అచ్చోటదావెడలి అతివనడచెనుగా - కొం అడవులును కొమ్మ కొన్నియు గడచి నైమిశారణ్యంబు నా నుగా - దైవదాటనచేత దారసిల్లిరి తనకు మునులు కొందరచట ముద తకావేళ - మాండవ్య కౌండిన్య మార్గలగాంగేయ కపిలుండు శాండి ల్య కౌసికుడు మొదలు - వాసిష్ట అత్రేయ వాల్మీకి జమదగ్ని మొదలైనమునులను ముదితదర్శించే - పాముపెట్టెనుడించి పదపడియు సా సాష్టాంగ దండములనుబెట్టి తరుణియావేళ - మునులార ఘనులార ము ల్లోకవందితులు మొరయింత వినరయ్యా ముదితజెప్పనుగా - అనియిటు లధ్యానించి తనపుట్టుపూర్వంబు యావత్తుతాజెప్పి అతివయిట్లనియె - పరమపావనులార పతిదానమిప్పించి కరుణనన్నేలుడి కర్తలుగ మీరు నాకు పతియైనట్టి నాగరాజును మీరు చిత్తగించం డని చెలియ గ్రక్కునను.

—* సుందరి మునులయొద్దకు బోయి నాగరాజును దించుట. *—

పాముపెట్టియుమాంత పణతిగ్రక్కునతీసి మునుల ముందరబెట్టి ముదితతానపుడు - పెట్టెగానెపాము దిట్టముగపడగెత్తి మునులమీదికి నడిచే నతివింతగాను - ఫణిరాజునేజూచి పరమపావనులైన మునులంత ఆశ్చర్యమును బొందిరపుడు - ఈచిలువరాజుతో యిలలోన గలయట్టి దివ్య తిరుపతులన్ని దిరిగితిని తండ్రి ఎచ్చోట దిరిగినా ఏనదిలో ముని గినా మొదటి నాకర్మంబు వదలలేదయ్యా - అనియిటుల సుందరి యతిదీన తనుబల్క మునులంత కరుణించి ముదితకిట్లనిరి - దివ్యతిరుపతులంత దిరి గినా నంటివి పేరుపేరులుమాకు కోరిచెప్పుముగా - ఘనపతివ్రత నీవు గనుక నీనోటను వాపేటిరులు వినిన కోటి పుణ్యంబు - పుణ్యంబునూ కబ్బు పొలతినినోము తిరుపతుల పేరులును తేటగాదెల్పు - అనియిటుల మునులుఘనముగాబలుక చేతులనుజోడించి చేడెదెల్పెనుగా - వినరయ్యా మునులార ఘనచిత్తములతోడ భువిలోన దిరిగిన పుణ్యభూములను - ఆకాశగంగయు అతిపాపనాశనియు పంపాసరోవరము పరగసేవిస్తి - వేత్రపతియుమధ్య వేగవతి హేమావతి గాయత్రి కాంచనా కపిలవా

రాహి - తామ్రపర్ణియు సింధు తగమరుద్వతి జేరి గోముఖియు స్వర్గముఖి
కోరిసేవి స్తి - వరసినాకిగిరీశ వారాహి గరుతాద్రి కాళింది నదిలోన
గ్రక్కునను మునిగి - సప్తముఖగంగయు సంగమైనాచోటు బ్రహ్మ
ముఖి యనుచోట పరగసేని స్తి - మందాకిని కబ్జ మణికర్ణికనదికముల
అమతిరుద్ధతీ యపుడు సేవి స్తి - వానందశయబాగు ఒనరంగ నేచూపి స్తి
కల్మషానవనీశు ఘనముగాచూ స్తి - మాదసావిత్రిని మాలిని బలు వేణ
కామినియు మొదలుగల బలుతీర్థములను - మానసేశ్వరానదియు మరి
సిహ్మత త్రిలోకపావనమూ స్తి ప్రాకటంబుగను - బహుక్షీరనదియు
ను బాగుగాగలుగు సుజ్ఞానదాయినిచూచి పూనిసేవి స్తి - చంద్రపుష్క
రణియు స్వామి పుష్కరణియు - నిత్యపుష్కరణియు నేను చూచితిని
హేమపుష్కరణియు క్షేమమున సింహాద్రి పుండరీకేశ్వరుని పొందు
గాచూ స్తి - కాళీశ్వరునిచూచి కడవేగగిరిజూచి గోవర్న మెళ్ళి - కౌమో
దకిచూచి కడుకురుక్షేత్రంబు బదరికాశ్రమ మపుడు బాగుగాజేరికి
ద్వారకయు సేవించి చేరిసంగామంట నారాయణాశ్రమము నాడు నే -
లితిని - కేదారేశ్వరుని మోగమున నే చూచి బృందావనముపోతి పొడ
దుగానపుడు - పాండురంగని యపుడు పట్టుగాచూచితిని వెంకటాద్రిం
వెళ్ళి వేడ్కమీరగను - నైమిశము సేవించినాడు మధురకు వెళ్ళి శ్రీకృష్ణ
పురికపుడు శీఘ్రంబుగాను రంగమందిర మెడలి రంగనిన్నే చూచి పంచి
క్షేత్రముచూచి బాగుమీరగను - అతి వేగమున నడచి అనంతగిరిచూచి
వృషభాచలము వెళ్ళి వేడ్కమీరగను - మాయూవి సేవించి మఱి కుంభ
కోణంబు శ్రీశైల మెడలితిని శీఘ్రింబుగాను - కంచిపురికే తెంఛి ఘన
వరదరాజులకు అతిభక్తితో మ్రొక్కి అచ్చోటు వెడలి - కనకాపురము
వెడలి కడుజనార్ధన మెడలి పుష్కరుని చూచితిని పొందుమీరగను -
కైలాసగిరి వెళ్ళి కడుహిమాద్రికి వెడలి స్వామిశైలము ప్రేమతోని
పుడు - అరుణాద్రి నీలాద్రి ఆమంగళాద్రియు అద్రికూటాద్రిని అపుడు
నేచూచి - గోవర్ధనగిరియుకోరి మైనాకంబు గంధమాదనగిరియుగ్రిక్క
నను వెడలి - మహేంలాచలము వెడలి మరిసింహగిరి వెడలి వింధ్యాచల
ము వెడలి వేడ్కమీరగను - చక్రవాక మెడలి చక్రతీర్థంబెడలి గోమ
తీగిరి కేగి గోగోపుచూచి - ఘటికాచలంబును ఘనురంగస్థలమును జం
బూనదికి నేగిజాగుచేయకను - హస్తినాపురిచూచి పంచపావవపంచాగ్రి
పురి నందపురి శీఘ్రింబునుచూచి - మణికూట మందిరము మరికొ్రిం
చపాదంబు వేదపాదముచూచి మోదమలరగను - క్షీరాబ్ధివైష్ణవ శ్రీ

కృష్ణతీర్థంబు నందిపాదముచూచి యందమలరగను - అపుడు సుబ్రహ్మ
ణ్యమ్మ వతివేగసేవించి స్మృతిపురవు నూపురము వేగనేచూచి - రుద్ర
పాదము వెడలి రూఢిమీరగనేను పంపాశరము వెళ్ళి పరగసేవించి - కా
ళహస్తికివెడలి కడువేగముననేను కడుహింసలు బొంది కాలవశము
నను - కన్యాకుమారియు కడువెంకటాద్రియు వాతపురి కాశ్మీరప్రీ
తిగా చూచి - వైకుంటపురిచూచి శరశంఖతీర్థము వేదారణ్య
మోదమునజూచి - పంచనాదము వెడలి పంచతీర్థము వెడలి శ్రీముష్ణ
జూచ్చి శీఘ్రబుగాను - శ్రేణానాశ్రమముజూచి శీఘ్రమున నతివేగ అఘ
నాధ నాంధము అపుడు సేవిస్తి - బ్రహ్మాండ నదియు భగవతీనదియును
సరస్వతీ సేతువు పరగసేవిస్తి - ఉదయకావేరిలో అభయమిమ్మనియడిగి
తిరుపతులు సేవించి దిరుగ జాలకను - దండకారణ్యంబు తగగడచివ
స్తిని మృగములైనా కాని అగపడవు తండ్రి - పులుల కాహారంబై తె
పుణ్యంబు కలదంచు బుషులు చెప్పగవింటి పొందుగా తండ్రి - ఇపుడు
చెప్పిన కన్న ఇలలోన మరికొన్ని తిరుపతుల దిరిగినను తెలుప లేదాయె
వాటి పేరులజెప్ప వశముగాదిక తండ్రి ఇంతకన్నను లావు తిరపతులు
కలవు - మేలుగా నాగుణము వీలుగా జూతుమని అడిగితిరి ఘనులార
అడిగితిరి యిపుడు - పుడమిలోపలనున్న పుణ్యభూములు చాల తెలి
పితిని మీకన్న తెలియకుండినవె - తెలుపి లేనటువంటిది తిరుపతులు
దిరిగితిని కమలగర్భునకైన కరుణరాదాయె - అతిశృంగారంబు ఇల
లోన రత్నాంగ రాజు గర్భమునందు తేజమలరగను - ఆడుజన్మము
గనుక అటుడిటు పతిలేమ సేయంగ నాకిట్లు పరమధర్మంబ - గరళకం
ఠునికైన కరుణ రాదాయెను పక్షివాహనుడైన రక్షింపదాయె - ఈపట్ల
తమరైన కాపాడకున్నను ఫణిరాజుతోగూడి ప్రాణముల్విడుతు - అని
యిట్లు సుందరియు అదిదీనతనుబలుక మునులును కరుణతో ముదితకిట్ల
నిరి - దివ్యదృష్టిని మేము తెల్లంబుగాజూచి నీపతియుచందంబునీకు జెప్పె
దుము - పూర్వజన్మమునందు పుడమికిని రాజతడు ఏడుదీవులుతాను
యేకచక్రింబు - ఎగురెదురునులేక యేలుచుండెను కొంత కాలంబున
కు నితడు కావరంబునను - బ్రాహ్మణుల భూముల పండనివ్వకదాను
అతుకుబడిగాకుండ అట్టెలనుబెట్టె - హగ్రహారంబులు హతముగావింప
గను ఆపాపఫలమిట్లు లనుభవంబాయె - బ్రాహ్మణులశాపమున పాము
రూపముకల్గె రమణిరో నీవల్ల రాజుయై యితడు.

—* మునులు దివ్యదృష్టినిచూచి నాగరా
పూర్వజన్మ వృత్తాంతంబు జెప్పుట. *—

నీపుణ్యమునయితి డెటులైన రాజపుతు తప్పకుండ. గలుగుగొప్ప సుఖములను - చిరకాలమున కయిన సృష్టింగోపలమీారు దంపతులు సుఖముగా వర్ధిల్లుతారు - పుత్రులను పౌత్రులను పాలుపొను సంపదయు ధనధాన్యములతోను ధరణివర్ధిల్లు - అలయరుంధతిలాగ ఐదువతనము కలిగి ఘనపతివ్రత నీవు గనుక వర్ధిల్లు - మాదీవనలునీకు మగువరోతప్ప కను దాఖలాగానుండు తరుణిగాన్పించు - ఇలలోన తిరుపతులు యెన్ని యును దిరిగితివి పడమటకు దిన్నగాపణతిరోనడుమిా - గారసిల్లినయట్టి తణి తిరపతులు నీవుసేవించుకుంటున్న శీఘ్రింబునడచి - పడమటంబుధి దరిని బ్రహ్మగుండంబుకలదు పాముపెట్టెలో గూడి పణతిరో నీవు - తడయకను స్నానంబు తరుణిజేసితివేని నాతిరో యీా పాము నరనాథు డౌను పతితోడనేగూడి పణతి నీనగరికిని - శీఘ్రముగ నెళ్ళెదవు చెలియతప్పదుగా - అనియిట్లు మునులంత అతివేగమునబలుక సాష్టాంగ దండములు చాలనర్పించె - మునులవద్దను సెలవు ముదితదా దీసు కొని పాముపెట్టెత్తుకొని పణతినడచెనుగా - కడువేగమున నడచి ఘటికాచలమునడచి ఘటికాచలమునడచి అరుణాచలంబునను అతివేగ నడచె - ఇంద్రాచలంబునను యింతితావలగొని శ్రీ వెంకటాచలము శీఘ్రమున నడచె - శ్వేతాద్రి దర్శించి చెలినందపురిజేరి వృద్ధపురియును జేరె వెలదితానపుడు - వ్యాఘ్రపురిగోస్తి పురిశీఘ్రముగదర్శించి బదరి కాశ్రమమునకు భామయావేళ - సుగ్రీవు నాశ్రమము సుదతి కన్నుల చూచి నారాయణాశ్రమము నాతిసేవించె - ఆకాశనగరియు అతిభక్తి నగరంబు పశుపతియాశ్రమము భామయావేళ - మంగళగిరియునుమఱి కనకగిరియును మఱికనకగిరియును కనకాంబగిరియు కాంత సేవించె - గోల్కొండగిరియును కొమ్మతా సేవించి అంజనాగిరియును ఆళ్వార్లగిరియు - పాండురంగగిరియు పశుపాలగిరియును చెన్నకేశ్వరగిరియుచెలియ తాచూచె - గరుడగిరినీలగిరి కాంతనాసేవించి మేఘుస్థలంబును నెలత సేవించే - అటుపైని యడవిలో అబలతానడచును చిత్రమైనటువంటి చెట్లచూచెనుగా ఏమికశోమితా వెలగమామిడిచెట్లు కనకపుసిరికతాడి కందతరువులును.

—* వన వర్ణనము. *—

నాగపున్నాగమ నంటిమామిడిచెట్లు శాల్మలీ మాకంద చంపకం

బులునుతీంగ్రివలకుండ తియ్యమామిడిచెట్లు తాలహింతాలాది తరువు
లేచూస్తు - సాలరసాయిదిచందనవృక్షంబు దానిమ్మమైనట్టి దబ్బతరువు
లును - ఖర్జూరకేదార ఘననారదకుండ నారికేళములపుడు నారిచూచు
చును - ఆశ్చర్యముబొంది అతివేగ నడచుచును ఘనమృగంబులుచూచి
కాంతగ్రక్కనను - ఏనుగులు సింహములు ఏకమై యొకచోట చెలి
యాడుచునున్న చేష్టలేచూచి - పందులును రేచులును ఒక
చోట కలసి మెలగుచున్న కాంతతాజూచి పెద్దపులులు లేళ్ళు
గాజతగూడి ఆటలాడుచునుండు అతివింతజూచి - కణుజులు దుప్పులును
ఖడ్గమృగంబులును కొండగొర్రెలుచూచె కొమ్మతానపుడు - కోతులును
నక్కలును కొండగ్రుచ్చులుగూడి తనచుట్టునకువంగ తరుణిభయపడక
వనముంగోగలయట్టి వనమృగంబులుకొన్ని మదిచాల చూచుచును మగు
వభయపడక - పతిభక్తిమదిలోన పట్టుకొని ఏకచిత్తముతోడ యింతి
నరువగను నెమలిపిట్టలుచాల నెరిపులులు చుట్టుకొని ఆటలాడుచునున్న
అందమటుచూచి - పిచ్చుక డేగలను పెనుగులాడుచుండ ఆవింతగను
గొని ఆశ్చర్యపడెను - కొంగలును కవిరెలును కూడియొక కొలనిలో
నీళ్ళుదాగుచునుండి నెలతకనుగొనెను - కాకులును చిలుకలును కలసి
యొకచోటనుండె గద్దలునుకోళ్ళుఒకవద్దనుండెనుగా - ఈనాటిచిత్రములు
ఇంతితాగనుగొనుచు తనమనసులో తాను తగుమెచ్చుకొనుచు - జాతీ
వైరములేదు జంతులజాలంబులకు ఇదిపుణ్యభూమనుచు యింతిమెచ్చు
చును ఆవనములోనున్న అవదూతలను మునులదర్శించి సేవించి తరుణి
నడచెనుగా - ఘోరవనమున యిట్లుకొంత భయపడకుండ కమలాక్షికద
లెను గడచి యీరీతి - అడవులిట్లుగడచి అతివేగమున నడచి అంగ
మాళవవజ్ర వంగదేశములు - కర్నాటమాళాట కాంభోజకురుమత్స్య
కోసలకొంకణ పరదేశములును - చోళశూరసేన గోళపుళిద్రాది నేపా
ళదేశములు నెలతావపుడు - పుణ్యదేశములను చూపించుచున్నట్టి దై
వములసేవించి తరుణినడచెనుగా - అతిదూరమునడచి యలసటను జెం
దంగ అతివకష్టముజూచి యజునిదయచేత - అల్లంతదూరమున తెల్లని
యుదకంబు కండ్లకునుగాన్పించె కాంతకంతెటను - ఆగంగనేచూచి అతి
వేగముననడచి గుండంబుదరిజేరి కొమ్మగ్రక్కనను - పాముపెట్టెనుదిం
చిభామగ్రక్కనదిగియు దోసిళ్ళతోనీరు ఆశదీరగను - దాహంబు బు
చ్చుకొని తరిజేరిగట్టునను దబ్బునను గూర్చుండె తరుణివరదేవి - నలుది
క్కులనుచూచి నరులెవరు లేకుండ మనసులోభయమంది మగువ దుఃఖం

చెనాలుగుసముద్రాలనడుమధ్య నున్నట్టి దివ్యతిరుపతులెల్ల తిరిగివచ్చితిని సకలదైవంబులకు సాష్టాంగదండంబు వేడుకుంటిచాల వేలవిధములను ఒకదేవుడైనను కరుణించియు నేడురక్షింపడాయెను పక్షినైతినిగా - ఈపైనితిరుపతులు యికదిరుగజాలకను యీగంగలోబడి యికప్రాణమిడుతు సాటిబోటులతోటి సరిగానుభువిలోన రక్షింపడాయెను పక్షివాహనుడు వసుధలో నా యీడు వనితలెల్లనుచాల తమపతులతోగూడి ధన్యులైయుండి - భువిలోన లేనట్టి అవమానమొచ్చెను పాముకును సతినైతీ యేమందు నికను - ఈజన్మమున నాకు యీ సుఖములుచాలు ఈపైనిబ్రతుకుట యిదిమంచిదికాదు - అనియిట్లుయటిచాలఅబలతాజింతించి నాథుడైనటువంటి నాగేంద్రునుచూచి నా ప్రాణనాథుండ నాగేంద్రగుణధామ నావారలనుబాసి నినుదెచ్చినాను - ఇప్పుడు నినువిడిచి ఇకనేనుబోతేనుపరు లెవరుచూచినా నాగేంద్రనిన్ను - పామనుచునిను వారు పట్టిచంపుదురేమో దిక్కుమాలినదాపు దేవుడీయవాసె - దంపతులుజతగూడి ధరనెల్లదిరిగినా తప్పలేదనిదెస్తె ముప్పువచ్చెనుగా నీతల్లివద్దనే నిన్నుదిగనాడకను యెడబాపిదెచ్చితికడుపాపినైతి - పూర్వజన్మంబున పూనిచేసిన దర్మబాయకను నన్నిప్పుడు పట్టికుడిపెనుగా - ఈజన్మముననిన్ను యిప్పోటవిడిచినా పాపంబులికనన్ను బాయకుండునుగా - ఎరిగిచేసి తప్పయేమంను నికతండ్రి ఆడబుద్ధులు కొంచెమనుమాట నిజము - రత్నాంగరాజింట రంజిల్లచరియించి గారాబుపట్టినై పరగజన్మించి - యెంతకష్టమునాకు యిలలోనవచ్చేది తెలియజాలకతండ్రి చులుకనైరీతిగా కలలోన యీ లాటికష్టమొస్తుందని తెలియనైతినితండ్రీ యిలలోననపుడు - బ్రహ్మవ్రాసినవ్రాలు బాయదెవ్వరికైన చింతింపబనిలేదు వింతరాయనుచు - దిగ్గునను తాలేచి దిశలెల్ల పరికించె పెట్టెమూతయుదీసె దిట్టతనముగను - నాథుడైనటువంటి నాగరాజునుదీసి పుడమిపై దిగనాడి భుగులుభుగులుమనుచు - ఘోరముమని సుందరీ గోపెట్టియేడ్వంగ హరిహరబ్రహ్మాదు లందరును వినిరి - యీరీతిగనుచాల ఘోరదుఃఖమునొంది కొంతదుఃఖము వదలికొమ్మ తెలివొంది - ధైర్యంబుతాజెంది దైవములకందరికిని నొప్పగింతలుపెట్టె అపుడువేశ్వర - హరిహరబ్రహ్మాదు లందరు కరుణించి ఘననాగరాజునుకాపాడవలెను ముక్కోటి దేవతలు మునులంత వినరయ్య - ప్రాపుమీరలునుండి ఫణిరాజునిపుడు అష్టదిక్పాలకులు అంతరుద్రులుమీరు - భోగిరాజునుయిపుడు పోషింపవలెను సూర్యచంద్రాదులు సూటిగా

వినరయ్య - ప్రాణనాథునిగాచి పాలింపవలెను గంధర్వకిన్నర కింపురు షయక్షులు - నా నాథునియిపుడు కాపాడవలెను-తల్లిదండ్రులబాపి తప్పి నేదెచ్చితిని - కాచిరక్షింపు ఘనులారమీారు దిక్కుమాలినయట్టి దీను లకు భువిలోన - దేవుడే తోడనుచు దేశవాడుకయు వాడుకలుబోకుండ వసుధలో యీ పట్ల - నానాథు లోకులకు దండ మర్పించి నా ప్రాణనాథ ఓ నాగేంద్ర ఫణిరాజ - సెలవు సెలవాయనుచు తానడిగె ఆ లెల్లను మతిని గోసియా సుందరి - ఇంద్రియంబులు ఇంతి తెంపుగను షడ్వర్గమును ద్రుంచి సఖయు గక్కునలేచి - గుండంబుదరిజేరి నిండువేడుకను కాశిదట్టియుకట్టి గంగ యెద్దునజేరి - తలిదండ్రులకుచాల దండములుబెట్టి శ్రీదేవినీదలచి భూదేవినీదలచి - పార్వతీదేవిని బాగునాదలచి ఒప్పుగా తన ప్రాణ వల్లభున మదినిలిపి - అత్తమామల కడు అబల తా మ్రొక్కి బాదములు జోడించి పడబోవు సమయాన - అట్లనే తాళుమని ఆకాశవాణి గగనవానియు బలి ఘనమైనధ్వనితోడ - తాళు తాళు మటంచు ధరణి వణకగను త్వర పడకు సుందరి త్వరపడకు చెప్పెదను - ఈగంగ మాహాత్మ్య మింతిరో విను ము స్త్రీనిజంపినయట్టి చెడ్డపాపంబైన - బ్రాహ్మణునిజంపి బలుపాప మైన గోవులనుద్రుంచిన ఘోరపాపంబైన - బాలికలచంపిన బలుపాప మైన పగచేత పొరుగిండ్ల తగులబెట్టినయట్టి - ఘోరపాపంబైన గాలిపో నమ్మ అన్నతంబుపలికి అధిక పాపంబైన - కనకం దొంగిలిన ఘనదోష మైన తలిదండ్రులకునిలలో తప్పినడచినదైన - పరస్త్రీలబట్టినబలుదోష మైన యీలాటిపాపములు యిలలోనుమఱికొన్ని - మొదలైన యాపత్తు ముదితరో యివట యీ గంగస్నానమున నివిబాసిపోవమ్మ - పావనంబై నట్టి బ్రహ్మగుండంబు అదిగనుకసుందరీయతి వేగమునసీవు - నాగరాజును యిపుడు జాగుసేయకను కంఠమునదాల్చి యీ గంగలో మునిగితే నాగ రాజుయిపుడు నరనాథుడౌను ఆకాశవాణపుడు ఆశ్చర్యముగ బలుక - నందమునుపొంది అపుడు గక్కునను పరుగెత్తి వేగమున ఫణిరాజునేబట్టి కంఠమందునదాల్చి గంగకును మొక్కి ముక్కు చెవులను మూసి ము మ్మారు తాము నిగి - దిక్కులను తాజూచి దిశలు వెలుగగను.

—* పాము నరనాథుడగుట.

తనయెదుట ఫణిరాజు నాథుడై నిలిచెను దినకరుచందమున తేజ రిల్లుచును - అర్ధచంద్రునిబోలు ఆరాజు నెన్నుదురు నల్లకలువలబోలు నరనాథుకండ్లు - శ్రీకారములుకన్న చెవులుచక్కగనుండె తిలపుష్పము

లకైనతీరైనముక్కు - ఇంద్రచాపముబోలు ఇలనాథుకన్బొమలుఅద్దంపు
రేకలే అతనిచెక్కిళ్ళు - కంఠమందునగాగ మణితాళ్ళియున్నట్లు నీదర్శన
ముచూడ నీటుగానుండె - దండధరునికిచాల రెండునాలుకలందు మండ
లాధీశ్వరుని మహిమచూడగను - ఎగుభుజంబులవాడు వెడదైనపక్షంబు
మృగరాజ మధ్యంబు జగధీశు నడుము - బంగారుఛాయచే బాగైనదే
హంబు నవమన్మధునివంటి నరనాధుచూచి - చూచికన్నులమూసి యొ
క్కింతమూర్ఛిల్లి తెలివొంది యాబాల తేరిచూచెనుగా - ఆరాజసుందరీ
అంతయును పరికించి ఆనందమునుబొంది అపుడు యిట్లనియె - నలలిత
గుణజాల నద్ధర్మశీలుడా గలిగితివియిప్పుడు కరుణాలవాల - నవమన్మధా
కార నరలోకజనవంధ్య రమణీయ గుణసాంద్ర రాజదేవేంద్ర - నిను
నమ్మితిని చాల నీవు నేనిల్లాల మన్మధునిబాధకు మఱితాళజాల - నన్ను
రక్షింపుము నరనాథ తనయుండ విన్నపంగాలించి వీక్షింపవయ్యా - అని
యిటులసుందరి ఆశ్చర్యముగ బలుక విని రాజసుతుడపుడు వింతగాబలికె
ఓబాలనీవెవతె నీయూరుపేరేదో ఏర్పాటుగాజెప్పు నేర్పుమీరగను -
నిజమేది తెలియకను నీకునేపతినంట వెఱ్ఱిమాటలదేల వెలదిరోతగునా -
కామాంధకురాలవై బామరోపలికితివి నేనిట్లునొప్పుదును నెలతరో కను
మంచిచెడ్డలురెండు మగువరోపలికితివి తెలియదన్నమాట కలికిరో విన
వె - అనియిట్లురాజు ఆటంకములుపలుకవిని సుందరినప్పుడు వేడుకతోబలి
కె - వినవయ్య ఓరాజ వివరించి చెప్పెదను భువిలోన కాశ్మీర పుణ్యదే
శంబు - ఆదేశమేలేటి అవనీతలేంద్రుండు ధర్మాంగ రాజన్న ధరణిప్రఖ్యా
తి - ఆరాజవరపత్ని అర్మిలీదేవంట పుణ్యశాలియుకలదు భూలోకమందు
ఆదంపతులకిపుడు అఘోరపామువై కొడుకుగా బుట్టితివి పుడమి నెలయ
గను - మరికొన్ని దినములు జరిగిపోయిన వెనుక మాయకల్పనజేసి నీ
మంత్రివరులు - విప్రులనుబంపించి వెదకించి భువియెల్ల చోళదేశమునం
దు శోధించిచూచి - మాణిక్యపట్నమున మండలాధిపుడైన రత్నాంగరా
జంట రంజిల్లభువిని - ఆరాజుకును గూతురైనట్టి త్రైలోక్య సుందరియు
కలదనుచు సూటిమీరగను - వినిమాయకల్పించి ఘనజాబులేనంపి మా
తండ్రిగారికి మతిలేమిజేసి నిర్ణయపుజాబులను నీటుగావ్రాయించి ఇంద్ర
జాలమురీతి యేమిచెప్పెదను - టక్కుమాటయేమి గ్రక్కున యేర్పడగ
చతురంగబలముతో అతిసంభ్రమునను - కత్తికిని బాసికముగట్టి పల్లకి
నుంచి తర్లించికొనివచ్చి, ధరణివెలయు - కత్తితెరపున మంత్రికర్తయై
తన మెడను శతమానమును శతమాశగట్టె - ఐదురోజులు పెండ్లి ఆశ్చర్య

ముగ జేసి నన్ను తీసుక వెళ్ళి నాడుమీామంత్రి - వెళ్ళింది మొదలుగా వేడు
కతోకొన్నాళ్ళు అత్తమామలవద్దనతిభక్తినుంటి - చిన్నతనమునయిల్లు
కొన్ని దినములు జరుగ తరువాతయౌవనము తారసిల్లెనుగా - సతిపతులు
యున్నట్టి పద్ధతులు పరికించి తాళజాలగలేక తత్తరంబుగను - పతిని
జూదామన్న [illegible]మబుట్టి మదిలోన వెదకితిని నే జూచి అతిభక్తితోను -
చేతులను జోడించి సిగ్గెల్ల దిగనాడి అత్తగారిని జూచి యడిగితిని రాజా -
సతియుచందంబు నాకు జెప్పకయున్న ప్రాణంబు విడుతునని పలికితి
జా - ఆమాటలమీద అహిరాజునే దెచ్చి పెట్టెమూతయుదీసి పట్టిచూ
పించె - నాగరాజును జూచి నా కేమి శోచకను నొక్కింతచింతించి గ్రక్కు
నను లేచి - బ్రహ్మ వ్రాసినవ్రాలు బాయదనిమదినెంచి పాము పెట్టెత్తుకొని
పైనమై వెడలి - నాలుగుసముద్రముల నడుమధ్యనున్నట్టి దివ్యతిరుపతు
లన్ని తిరిగితిని రాజా - తిరిగితిరిగియు నేను దిమ్మచేనిచ్చటికి ఈ వేళవచ్చితి
యెలమిమీారగను - తిరిగితిరిగియు మఱి తిరుగ జాలక నేను మనసులో
భయమంది మదినిచింతించి మఱి తిరుగజాలకను మతిలోన భయమం
ది పాపంబు చెల్లదని మదినిచింతింతి - ఆశలన్నియుగోసి రోశి యీాజ
న్మంబు ఇకచాలుచాలునని సకలంబువిడిచి - ఈ గంగలో దిగి విడుతు
నని ప్రాణములు నిర్ణయించితినయ్యా నేడు మహారాజ - పాము పెట్టెను
దీసి ఫణిరాజు నేబట్టి బైటనువిడచి దిట్టతనమునను - గంగయొడ్డున జేరి
గ్రక్కునను పడబోవ అట్లనె తాళుమని యాకాశవాణి - ఈగంగమా
హాత్మ్యమిపుడు త్వావర్ణించి నాగరాజునుబట్టి నాతిరోసీవు - ఈ బ్రహ్మ
గుండములో ఇంతిరో మునుగుము నాగరాజప్పుడు నరనాథుడౌను
ఆకాశవాణపుడు అతినమ్మకము పలుక ఆలాగు చేసితిని అని వేగము
నను - స్నానంబు చేయగను సర్వేశు దయచేత రాణింప ఫణిరాజు రా
జువై తివిగా - అని యిట్లు సుందరిఅది కథ యావత్తు వొనగూర్చి యీాశ
తి పొందుగాజెప్పె - జెప్పగా విని రాజు ఒప్పడాయెనుయింక స్త్రీలమా
టలనమ్మ శక్యమా యనుచు - ఆరాజు భావంబు అతివతా గుర్తెరిగి
గగనవాణినిగని మిగులవేడెనుగా - వేడగా నేచాల వెలదిపై దయవచ్చి
ఘనగర్జితమురీతి గగణవాణపుడు - ఓరాజ దేవేంద్ర ఒప్పగా వినవ
య్యా ఆబాలమాటలు అంతయునిజము - సందేహమ్మావద్దు పొందుగా
జతగూడి దంపతులు సర్వదా వర్ధిల్లుడనెను - ఆచంద్రతారార్కమభి
వృద్ధిగామీారు పుత్రులును పౌత్రులును పృథమివర్ధిల్లు - తామరతంప
రై ధరణిలో వర్ధిల్లి సకలసుఖంబుల మీారు యశమొందవలయు - ఆకా

శవాస్తు లని దీవన నివ్వంగ రాజదేవేంద్రుండు అంతయునునమ్మి - ఆనందమునుబొంది అతిష్ఠ చెయిపట్టుకొని దంపతులు గంగలో నోల లాడిరిగా - దంపతులు అతివింతనోలలాడుచున్న బహుదూరముననుండి బ్రాహ్మణోత్తములు - పిల్ల భంగులువీడ పిలకలల్లాడంగ మొలనున్న చేరీలు ముడ్డికేతగుల - దర్భాసనముతీసి చిత్రాసనంబుల చంకపంచాంగములు జారిపోవగను - చెమటలు గారంగ సమయంబు కుంచెనని పరుగెత్తుకొచ్చెను బ్రాహ్మణోత్తములు - వచ్చియెద్దున నిలచి దంపతులునే చూచి అవుభళీయనివారు అందరునుదిరిగి - గంగ గ్రక్కున దీసి ఘనమంత్రములుజదివి రాజచేతులబోసి రభసముననిరి - గొప్ప రాజవుగనుక ఇప్పుడీస్థలమందు గుఱ్ఱాలు ఏనుగులు గొప్పదానములు - భూపతులు గనుకను భూదానమివ్వవలె మణులదానమునిస్తే మామంచి దిచట - వరహాలుమోరీలు వస్త్రదానంబులుతిరిగిన ప్రభువులుగనుక దయసేయవలెను - ఆలాగుమతియుమరి ఆవిప్రులును పలుక మరియేమితోచకను మగువతాబలికె - తనపుట్టుపూర్వంబు తాబడ్డకష్టంబు పూనగూర్చినరీతి పొందుగాజెప్పె - కాషాయవస్త్రము కడచెంగు ముడివిప్పి ముత్యాల హారంబు మోదమునబట్టి - విప్రపుంగవులార వినరయ్య మీరంత పేదలముమేమును పెన్కుదానములు - ఇవ్వజాలముగనుక దవ్వసేయ కమలమ్ము ఈపైనికరుణించి మన్నించవలెను - ముత్యాలహారంబు మోదమునమీకిత్తు పదివేలుగాదీన్ని భావించిమీరు - అనియుటులసుందరి అతిదీనతబలుక జయముజయమని పొగిడి జగతి సురులంత - వేదపనసలు చదివి వేడుకల దీవించి హారంబు గైకొని ఆనందమునను - మీ పుట్టుపూర్వంబు నెలతరోచెప్పితివి చిత్రమైతోచింది చెలియరో మాకు - ఈ గంగమహత్మ్యమింతరోవినవమ్మ బ్రహ్మదేవుడు తొల్లి యిమ్ముగానిచట - విష్ణుమూర్తికొరకు నిష్టతోడుత తపము చిరకాలమునుజేసి సిద్ధిబొందెనుగా - అదిమొదలుగా గంగ అతిపావనంబయ్యె బ్రహ్మగుండము పేరు బరగె భువిలోన - అనియిటుల బ్రాహ్మణులు అతిదీవనలనిచ్చి ఎవరియిండ్లకువారు జారివెళ్ళిరిగా - తరువాత సుందరియు తనపతినిగూడుకొని దరిగానున్నట్టి ధర్మపురిజేరె - ఆరాత్రి యామూర్తి నానందముగనుండి నరసింహగుడికిని నాడు వెళ్ళిరిగా - స్వామికిని పదివేలు సాష్టాంగములుజేసి వరుస నా దంపతులు మగువ పడచెనుగ - ఒకటి రెండుయు మూడు నొనరంగ బదినైదు దేశ దేశములన్ని తేటగా నడచి నదులు నిధులును గడచి నట్టడవులును గడచి సౌరాష్ట్ర

ళంబు సరగునను జేరి - తనతండ్రి దేశమునడచి మాణిక్యపట్టణంబుదరిజే
రపతితోడ తరుణి యిట్లనియె - ఓరాజదేవేంద్ర యొప్పుగా వినవయ్య
మాతండ్రిగారున్న మాణిక్యపురము - ఈపట్టణమేయనుచునింతి తాజె
ప్పుచును ఆపట్నములోకొచ్చి అతిత్వరగనడచె - రాజమార్గముబట్టి తేజ
ముగనడవంగ పురజనులు చూచిరా పొలతిచందంబు - త్రైలోక్యసు
రి తేటగాబరికించి - ఒకరినొటనుఒకరు నొప్పుగాననిరి-తత్తరంబుగజ
తమగృహంబులువెడలి రాజమార్గముచేరి రమణినేజూచి - వనితలందరు
గూడి ఒకచోటగూడుకొని ఆశ్చర్యముగ మాటరాడుచుందురుగా - ఏమ
మ్మయాబాల యీలాటిరాజులతో కాళ్ళనడకరా కారణంబేమి - గొప్ప
రాజుకుతాను కోడలై యుండగా దీనురాలై యిట్లు తానువచ్చెనుగా - ఆ
అత్తగారింటను అతివేమిచేసెనో ఆదంపతులుగూడి అతిత్వరగవచ్చె -
మరియేమిజరిగెనో మనకేమిదెలుసును గొప్పరాజులమహిమ చెప్పతర
మాన - అనుచుబురజనులిట్టు లాందోలపడుచుండ కొందరును పరుగెత్తి
పొందుగానపుడు - రచ్చలోకూర్చున్న రత్నాంగ రాజుతో నీవార్తజె
ప్పిరి యెలమి మీరంగ - చెప్పగావినిరాజు చాలచింతించును ఆశ్చర్య
మునుబొంది అపుడువచ్చెనుగా - రాజుగారితోను రాజమంత్రులుకూడి
రాణువతోవచ్చిరి దయముమీరగను - కొనతిరిగివచ్చుటా కూతురుని
జూచి కడువేగమునబట్టి కౌగిటనుజేర్చి కన్నీరుపొలుకంగ కడుదుఃఖ
మునుబొంది అల్లునికూతురుని అపుడు దోడ్కొనుచు - తనకోటలోనికి
తక్షణమే వెంజేసి అతివలుయుండేటి అంతఃపురముచేర - దిగ్గున నాతల్లి
దీనురాలైయున్న కూతురునిజూచి గోడుమనియేడ్చె - తల్లినిబట్టుకొని
తరుణిసుందరియేడ్వ తల్లికూతురిటుల తటవిటలుపడగా - అక్కడుండిన
కాంత లందరుయేడ్వంగ వాదించె ఆరాజు వారిదుఃఖములు - దుఃఖ
ములువాదించి తొడమీదకూతురును కూర్చుండనియమించి కొంత తడ
వుంచి - తల్లిరో మాతల్లి తరుణి సుందరి నీవు ఈలాగు దంపతులు యెం
దుకొస్తిరిగా - దంపతులు నిద్దరు ఒంటిగా జతగూడి కాళ్ళ నడకను
రాను కారణంబేమి - అత్తమామలు నిన్ను అదిమికొట్టిరి యేమో ఈ
రీతివచ్చుటకు కారణంబేమి - మరియేమిజరిగెనో మా వద్ద దాపేమి
కూతురా చెప్పుమని కోరి అడిగెనుగా - తరుణిదిగ్గునలేచి తలిదండ్రులకు
మ్రొక్కి చెప్పెదను వినుతండ్రి చిత్రకథయంత - మంత్రిపుంగవు డపు
డు మాయకల్పనజేసి నన్ను తీసుక వెళ్ళినాడు మా తండ్రి నేనువెళ్ళిన
మొదలు నేడువారింట అత్తమామయెద్ద నతిభక్తినుంటి - ఆరీతి కొ

న్నాళ్ళు అపుడు జరిగిన వెనుక పతినిచూతామన్న భ్రమపుట్టె నాకు - చిన్నతనమువిడిచి సిగ్గెల్ల విడనాడి మాయత్త నడిగితిని మహానుగానపుడు పతినిచూచినగాని మానుగా నపుడు పతిని చూచినగాని ప్రాణముల్ విడుతునని తెంపుచే నడిగితిని తేటగానపుడు । ఆరీతి నీనడుగ నతిశ యంబునుబొంది మూలనుండిన పెట్టె ముందరికిదీసి । కోడలా చూడు మని కొమ్మమూతనుతీసి పామునే చూపించె పతివీడె యనుచు । నా పూర్వకర్మమున నాగర్భమందున నాగరాజయిపుట్టె నాతిరో యనెను అని చూపగానేను నాబ్రహ్మకునుమెచ్చి పాముపెట్టెత్తుకొని పట్ణంబు వెడలి । నాలుగు సముద్రముల నడిమధ్యనున్నట్టి దివ్య తిరుపతులన్ని తిరిగితినితండ్రి । తిరిగితిరిగియు నేను దీమొట్టివేసారి బ్రహ్మగుండము లోన పడిచావబోవ । ఆకాశ వాణపుడు అతివింత బలుక ఆ పలుకు లాలించి అటులచేసితిని । స్నానంబుసేయగా సర్పంబు తత్క్షణమే నర నాథుడై నిలిచె నాభాగ్యముననూ అపుడు సంతసమంది ఆ రాజుతో గూడి నడచి వస్తిని తండ్రి గడువేగముననూ । త్రైలోక్య సుందరటు తీరెల్ల జెప్పంగ ఆశ్చర్యమునుబొంది రపుడు తలిదండ్రి చెప్పగానే రాజు చిఱ్ఱిమనిలేచెను పుట్టపై వెడలినపాము పోల్కి వేగమున । రత్నాం గదుండొచ్చి రచ్చలో గూర్చుండి హితులను చూచిరి అతికోపము నను । విన్నార మీకింత వెలది సుందరి మాట ధర్మాంగదుడుచేయు దారుణంబంత । తన పూర్వకర్మమున తనపత్ని గర్భమున సర్పంబుజని యించె జగతి వింతగను । పుట్టగానేమంత్రి పుత్రుడని సాటించి మటు మాయకల్పించి మనల భ్రమియించి । మన సుందరిని వారు మాయ గొంపోయి పామునకు మనిషికిని పరిణయముచేసె । ఆ పామునేపట్టి అవనిలోగలయట్టి దివ్యతిరుపతులన్ని తిరిగెనట బాల । తిరిగితిరిగియు బాల తిరుగజాలకను పడమటంబుధితరిని బ్రహ్మ గుండమున । పడి చావబోవంగ బలికెరట గగనంబు ఘనమైనధ్వనితో కడువింతగాను । ఆపలుకులాలించి యాలాగుజేసె తత్క్షణమే ఆ పాము ధరణీశుడాయె । ఆయువకునిగూడి ఆనందముగ నడచి మనయింటికొచ్చెనట మహిమ విన్నార ఈలాటి చిత్రంబు యిదివరకు మనమెపుడు వినలేదు కనలేదు విశ్వంబులోను - అతిగనుక రాజు అతిమాయలెట్టివో కడువేగమున మన ముకండ్లచూతాము చతురంగబలముతో అతివేగమున వెళ్ళి ధర్మాంగ పురిమీద దండెత్తవలెను - మంత్రిని బరిమార్చి మతిబలమునుమ్రించి ధర్మాంగరాజును తక్షణముపట్టి - మాయలన్నియుబాపి మతివేగబంధిం

చిదీసుకొని గావలెను దోషమనకుండ - బుద్ధివచ్చినదాక భువియెల్ల తెలి
యంగ బందిఖానాలోనబడవేయవలెను యనుచుమంత్రులజూచి ఆరాజు
బలమెంతో జూడవలెనని చాల శూరుడై పలికె - సైన్యముల బిలిపించి
బహుబలములనెల్ల సాటించుమనిపల్కె సాహసంబొగనను నెరవై నతనపెద్ద
బుద్ధైనజెండాలనరుదుగా నెత్తించుమని పలికినపుడు మన దేశమం
మన్నె రాజులనెల్ల నతివేగబిలిపించుమని పలికెనపుడు - చతురంగ
లనుహితవు గారమ్మనుచు సాటించుమని పలికెనపుడు రత్నాంగుడీరీల
జసంబుగబలుక ఆలాగుచేసెను ఆమంత్రివరుడు ఈ లాగు సభలోను హె
చ్చుగాజరిగినది అంతపురిలోమాట అంతజెప్పెదను త్రైలోక్యసుందరియు
తనభర్తయనుగూడిపతిసతుల సంతోషభరితులైయుండి - పంచభక్ష్యా
న్నమును భక్షించుచుచాల అద్దాలమేడలో ఆనందముగను సతిపతులు
జతగూడి నాశీతిబంధముల చతురత కేళీలు సలుపుచుండిరిగా - ఈరీతిసు
ఖముగా నింతరాత్రనక పగలనక భేదింపరాకుండ మోదమున నుండి
తాపడ్డకష్టములు తన మదిని తలపోసి అత్త మామల జూడ నాశ
బుట్టెనుగా - ఒకనాడు తలిదండ్రి వద్దనే గూర్చుండి వినయంబుగా
బల్కె నెలది సుందరియు - మాతండ్రి మేమొచ్చి మాసంబు కావ
చ్చె మాయత్త మామయును మా కొరకు నిపుడు - ఎంత దుఃఖితు
లైరో ఏలాగువుండిరో చూడవలె తక్షణమే వేడుకలరగను - అది
గనుక మా తండ్రి ఆలస్యమికవద్దు సెలవిచ్చి పంపుడీ శీఘ్రముగమ
మ్ము - చతురంగ బలముతో హితవుగా మీ రిపుడు మమ్ము తీసుకొని
మాయత్తయింట ధర్మాంగరాజును దండించి బెదిరించి నానాథు జూ
పినరులమెప్పించి - ధరణీశులందరిని తక్షణము తెప్పించి యీ వార్త
యెరిగించి యిలకీర్తిగాను - మాదంపతులకిపుడుమరి పెండ్లి చేయనుఅవనీ
శులకునెల్ల ఆనందముగను - ఆలాగుజేయించి అత్తింటనేయుంచి అల్లుని
దీవించి అందముగనేడు - మీరుబంధువులగూడి మీపురికిమీరిపుడుమర
లరావలెనయ్య మాతండ్రికాన - అతివసుందరీలాగు ఘనముగాబలుకంగ
సరదార్లరప్పింపసెలవిచ్చెనపుడు - పైనంబులేవనుచు బాగుగాసెలవిచ్చి
రణభేరి వేయించుమని పలికెనపుడు - పుడమియాకాశంబు బూరటిల్లగ
మ్రోయ రణభేరి వేయించు రాజ్యంబులోను - బ్రహ్మాండ భాండముల్
పగిలిబీటులువేసె దిగ్గజంబులు చెవులుదిమ్మువెయ్యగను - కులశైలముల
తోటకుంభినులల్లాడసూర్యచంద్రుల గతులు మాటతప్పగను - చల్లచేసి
నయట్లు సముద్రములుఘోషించె యెల్లభూములు తల్లడిల్లె నంతటను -

అలాగుసెలవిచ్చి అతియుగ్రుడై తేచే జంషానీశానీలుచాలనె త్తించె - పది వేలుడేరాలుబండ్లమీాదెక్కించి ముందుగానడిపించె మోదమలరగను - రత్నాలపల్లకిలో రమణిసుందరినుంచి అద్దాలపల్లకి అల్లునెచ్చె - వజ్రములయంబారి పొనరంగతానెక్కి చంద్రహారపు కత్తిచేత తాబూనె - చతురంగబలములా యత్నముగా నడిపించి ఢంకానిశానిలు ఘొంకముగ నడువ - రత్నాంగరాజుతాపతియత్నముగదర్లి కనకాపురముపై ఘనముగానడిచె - చినచినమజిలీలు పెద్దపెద్దమజిలీలు ఆరీతినడిపించిరపుడు సరదార్లు - అంగవంగకళింగ బంగాళనేపాళ కర్ణాటదేశములు గ్రక్కునను నడచి - కాశ్మీరదేశంబు కడువేగమునజేరి కనకాపురముదరిని జననాథుడపుడు - వీలుగాడేరాలు వేయించెరత్నాంగు డేడుకొండలరీతికై నవచ్చుననగ - పట్టుడేరాలోన పరమరహస్యముగాను అల్లునికూతురుని అపుడు తానుంచి - రత్నాలడేరాలో హితవుగాతానపుడురత్నాంగదుడునిలిచె రాజసంబుగను - కనకాపురముచుట్టు కడుభయంకరముగ విల్లువిరచినలాగు వేలములుడిగ్గె.

—* రత్నాంగరాజు ధర్మాంగరాజునకు జాబువ్రాయుట. *—

రత్నాంగరాజపుడు రాజసంబలరంగ ధర్మాంగరాజునకు తగుజాబులంపె - పదివేలుదండములు బావగారికినేడు చక్కగావ్రాయించె జాబులన్నియును - తరువాత మేమిపుడు తమదర్శనంబునకు వచ్చినకారణం బొనరంగవినుడి - చాలకాలంబాయెచేడె మాసుందరినితీసుకొచ్చెను మంత్రితీరుగానపుడు - అదిగనుక మేమిప్పుడు అల్లునికూతురునిచూడవలెనని భ్రాంతి వేడుకతోపుట్టి వచ్చినారముగనుక రచ్చచేయక మీారు కొడుకునుకోడలనుకూడ తోడ్కొనుచు - మాదరికివేగ్గచేసిమమ్మిట్లుమన్నించి మాకుసెలవిప్పించుమని కోరుతాము - జరుగుచున్నదిగనుక జాగుసేయక తమరుమాచిన్నిసుందరిని మరిపంపవలెను - ఆలస్యమికవద్దు అమృతంబువిషమౌను వేలముజూచితే విశదమౌతుంది ! ఇటుపైనిమాావద్ద మటుమాయలుంచితే వీరకాడివని బీరసీచౌను - వనమంత్రతంత్రములు మఱిపనికిరావిపుడు టక్కుజేసి తెపరుపు దక్కదిటుపైని - అనిజాబులీలాగుఅతివేగమునబంపి రణభేరివేయించె రణభూమిలోను - పుడమియాకాశంబు గడగడనివడకంగ పట్నముచుట్టును ముట్టడిజేసెనుగ - అపుడు ధర్మాంగదుడు ఆజాబులేచూచి గుండెఝల్లుమనంగ కూర్చుండబడెను - మఱియేమితోడకనుమంత్రినిరప్పించియీజాబులేచూపి ఝల్లనుచుబలికె - మాయ [illegible] మామాటవినవైతి కఠినమొచ్చినపుడుకాదుపొమ్మనెను-నీవల్ల

నెమాకు నేడు మరణముగూడె తప్పించు మాతండ్రి యొప్పిదముగాను - ధర్మాంగరాజిప్పు డైర్యంబుచెడిపలుక మంత్రియేమన లేకమరిపలుకజాలు మంత్రిమదిలో నప్పు మరియేమితోచకనునిలుచుచున్న పాటునె నేలకొరిగెను గా ఆలాగు తనమంత్రి అవనిపై బడగానె ధర్మాంగరాజపుడు డైర్యం వదలి। మఱికొంత తడవుండి మనసులోపలపోసి ఏటుచూచినాగాని ఏ తోచకను। మనలోన తానపుడు డైర్యంబు దెచ్చుకొని తన మంత్రి జూచితానిట్టనియె। మంచిచెడ్డలు రెండుమఱియు తెలియునటువంటిమం త్రిమాటలునన్ను మఱిహానివచ్చె। ఈపట్లమనకిపుడు యెవరడ్డపడియేరు సర్వేశ్వరుడేమాకు సాయమాగాక। రత్నాంగరాజొద్ద రాజసంబునువిడి చి ఉన్న చందమునేను విన్నవించెదను। విన్నపం బాలించి మన్నించి స్వామేలె మన్నింప కున్నను మఱిదొడ్డమేలే। నేరమొచ్చిన దనుచు నేనొడంగాను రక్షించజాలన్ను రత్నాంగదుండు। అని యిట్లు హితు లతో ఆలోచనలుచేసి తగిన జనవరులతో తానుబయలెళ్ళీ। రత్నాంగ రాజుకును రాజసంబలరంగ జాబులేనంపించె జాగుసేయకను ఆ జాబు లేచూచి అపుడు రత్నాంగదుడు కర్ణీతివాసీల కూడవేయించె। అం త ధర్మాంగదుం డచ్చోటికిసిరాగ రభసముననే తెంచె రత్నాంగధ రుడు। వీరకాని చెయ్యి వింతగాబట్టుకొని సరస సల్లాపముల చాల మ న్నించె। హితులందరును చాల వింతగా మన్నించి తా నున్న డేరాక తనిదీసుకెళ్ళె। చిత్రమైనటువంటి సింహాసనమునందు వీరవరులిద్దఱు కోరికూర్చుండి। తర్వాత పెద్దలను తగునాసనములందు కూర్చుండ నియమించి కొంతతడవుండి। వీరవరునితోను నేరుపున మఱికొన్ని దేశ భోగొట్టాలుచేసి నవ్వుచును। మీకుమారునియిటకు మీతోడీసుకొని రానికారణమేమి రాజాధిరాజా। మిగుల మానగరికాను మగువ మా సుందరియు మీయాజ్ఞ సెలవులో మెలగెనాకాదా। అత్తమామలవద్ద అరమరలులేకుండ మసలుచున్నదిలేదు మాచిన్నిబాల। ఈరీతిరత్నాం గుడెఱిగియెఱుగనిలాగు వీరకానిని అడుగ నేరువలరగను। ఆ కబురులా లించి అపుడుధర్మాంగదుడు కలకలంబడి చాల కన్నీరులొలుక। అపుడు రత్నాంగదుని హస్తములు బట్టుకొని నేరంబుకాచితే నేనువిన్నిపింతు నా పూర్వకర్మమున నాసతియు గర్భమున నాగరాజుబుట్టె నానాటికి పుడు। బుట్టగానే మంత్రిపుత్రుడని సాటించి మా మాటలనువినక మా యగల్పించి। మిమ్మునటుభ్రమయించి మీపట్టి సుందరిని మా యింటికి దెచ్చె మంత్రిపుంగవుడు - తెచ్చినది మొదలుగా త్రైలోక్యసుందరి

హావద్ద భక్తితోమరి సలుపుచుండె - పతినిజూతామని భ్రమసుబుట్టి ఒక
నాడు అత్తనేలడిగెను అపుడుదుఃఖించి - పాపిష్టి అయత్త పణతికిని విభు
డంచు ఫణిరాజునేచూపె పణతిసుందరికి - ఆపాముతాజూచి అతిఘోర
దుఃఖమున మమ్ములందరిటిట్టి మామాటవినక - పాముపెట్టెత్తుకొని భూ
మింగోనున్నట్టి దివ్యతిరుపతులన్ని దిరుగుతాననెను - ఆమాటవినుమేము
అందరునుదుఃఖించి పట్టుకుందామన్న పణతితావినక - ఫణిరాజుతోగూ
డిఫణతితానేగి మరిసాహసంబునచాలసాగివెళ్ళెనుగా - మాసద్ద నేరంబు
మఱిచాలగలిగుండు మరలించలేమైతి మగువసుందరిని - గోడలటుపో
యెనని ఘోరదుఃఖముచేత మాలోన మేమపుడు మరుగుచుంటిమిగా -
ఈవార్త భూమిలోన యెవరువిన్ననుగాని అతినిందవచ్చునని అడలుచు
న్నుంటి - నిద్రయాహారములేక దుఃఖింపుచును చావులేనిబ్రతుకు జగతి
బ్రతికితిని - రాజసంబునువిడిచి రత్నాంగ రాజుతో వినయంబుగా నిట్లు
విన్నవించెనుగా - ధర్మాంగరాజపుడు ధైర్యంబు చెడిపలుక రత్నాంగ
రాజపుడు రాజసంబుగను - ధర్మాంగరాజనని ధరణిలో ప్రఖ్యాతి వాడు
కలునేనమ్మి వనితనిస్తినిగా - అలముద్దరాలను అడవులకు బంపితిరి మీా
వంటిమానవులు మేదినిలోగలరా - పామునకు మనిషికిని పరిణయము
సేయుట వినలేదు కనలేదు విశ్వంబులోన - ఈఘోరకృత్యంబు నిలజను
లొప్పరు మీావల్ల నేజరిగె మేలుగానిపుడు - ఐతేనికానిమ్ము ఆపైనిజూ
తాము కానిమ్ము మంత్రిని కడువేగమునను - తప్పకనుమంత్రిని దప్పిం
చవలెనపుడు తనమాయలెట్టివో కనవలెను మేము - మాయలన్నియు
మాపి మంత్రినిబరిమార్చి ఆపైని మీామాటలాలకించెదము - అనియిట్లు
రత్నాంగు డతికోపమున బలుక ధర్మాంగు డింతట తటవిటలు పడెను -
తనచేతులనుబట్టి తలపైని యుంచుకొని కాచి రక్షింపవలె ఘననేర
మిపుడు - జనులుచేసినతప్పు జననాథుడేగనుక మంత్రితప్పులుకావు మా
తప్పుగాని - అనియిటులు ధర్మాంగు డతిదీనతను బలుక రత్నాంగరాజ
పుడు రాజసంబుగను - ఈఘోరకృత్యంబు మేదినీపతులెల్ల వినవలెను
యీాపట్ల వేగమేయనుచు - హర్కారులనుబెట్టి అవనిలో గలయట్టి రా
జాధిపతులను రప్పించిరపుడు - బుధులుపండితులార్య భూమీశులేవచ్చి
సభదీర్చియావేళ విభవములరగను - అపుడురత్నాంగదుండు అతిభయం
కరముగాసభవారినందఱినిచాలపరికించె - సభవారు వినరయ్యచక్కగా
నామనవి ధర్మాంగదుడునేయు దారుణంబంత - అనియిటుల రత్నాంగు
డాదిమూలంబుగా మంత్రిపుంగవుడేయు మాయలే చెప్పి ధర్మాంగ

ముడు సేయుత ప్రతినెరిగించి త్రైలోక్యసుందరితీరెల్ల జెప్పె । చెప్పగాసభ
వారుగొప్పగ వినిచాల ఇదిఘోరకృత్యమని యెంచిరందరును - అంతట
ను రత్నాంగ ఉచట దాదులబిలిచి అల్లుని కూతురిని అపుడు దెప్పించె.
సభవారి మధ్యమున చక్కగా పిలిపించి బాలవినుమనిపలికె రత్నాం
గరాజు - కుతురా నీబిడ్డఘోరకృత్యంబంత యెరిగించు సభవారికి
ట నేయనగ - మగువ సుందరియపుడు మామగారికి మ్రొక్కి సభ
జూచి చాల నుడనుచు - కనకాపురము వెడలి ఘనమధ్య తిరుపతి
మూవత్తు దిరిగితి నెలమిమీరగను - నానాథుతోగూడి నైమిశారణ్యం
బు సాగివెళ్ళితినయ్య చక్కగానపుడు - అచ్చోట ఘనమునుల నంద
రినిదర్శించి నాపతినిజూపి స్తి నాగరాజునుగా - ఆ పామునేజూచి ఆశ్చ
ర్యమును జెంది దివ్యదృష్టినిచూచి తెలిసి చెప్పిరిగా - వారు చెప్పినరీతి
వారాశిదరిజేరి పడమటం భుధిదరికి పరుగెత్తివెళ్ళి - బ్రహ్మగుండము
జూచి బ్రతుకంత చాలునని అతిత్వరగ పడగబోవ ఆకాశవాణి - చేడె
రో నీకిపుడు చెల్ల దేతెంపనుచు శేషునితో స్నానంబు చేయుమని పలికె
స్నానంబు చేయగా సర్పంబు రాజయ్యె జూడనిశుద్ధులును సూటిమీ
రగను - అతనిశుద్ధులుచూడ గాసవాలన్నియును అతని కనవచ్చును
అందరియెదుట - ఫణిరాజునవెనుందు నాథుకంఠముతీరు వాలుకలురెం
డుండు నానాథుకిపుడు - అని యిట్లు చెప్పగా అప్పుడా సభవారు అది
నిజంబనిచాల అతినమాటలను - ఆకోమి సుందరి అతిసమ్మకము బలుక
అచ్చోట సభవారు ఆశ్చర్యపడిరి - అపుడు జేడెరో నీవు అతినమ్మకము
జెప్పి అందరిని మెప్పింప ఆడితివిమాట - నేనమ్మజాలను నెలతిరో నీప
లుకు నిజము కనపరచితె నెలత నమ్మెదను - ధర్మాంగదుండంత తల
యూచి పరికించి కోడలా వినుమనుచు వెటకతో బలికి - దేశదేశము
లెల్ల తేటగాగను వెదకి మనసుకొచ్చినరాజు మగువ నీవుకోరి - యీరా
జుతోగూడి యిటు వచ్చితివిగాని నీ మాట లెల్ల నిజముగానమ్మ -
గగణవాణిచ్చోట ఘనముగా బలికెనని చెప్పితివి నీవు గొప్పగానమ్మ
అచ్చోట గగనంబు యిచ్చోట లేదటవె యిందరికి తెలియంగ యిటు
బలుకరాదు - వట్టిమాటలు నీవు వనితరో బలికితి నమ్మజాలను సుమ్మి
నాతిరోయతని - అనియిట్టులాతరి అందరియెదుటను దూషణంబులు తా
జేసె దోషమనకుండ - మామగారిరీతి మరియు దూషింపగా చెలియ
కోపముతోను చేతులనుమోడ్చి - అతిపతివ్రతయైనయువతి ఆకాశవాణిరో
నాడుపలికిన పలుకు నేడుపలుకమ్మ - లేకుంటె మా మామ లేశమైనా

నమ్మడాయెను మదిని నామాలన్ని - త్రైలోక్యసుందరీ తీరుగా బలు
కంగ అతివపై కరుణించి ఆకాశవాణి.

—* ఆకాశవాణి సుందరి పతివ్రతని రాజుతో జెప్పుట. *—

మేఘగర్జనరీతి మేదిని పలుకంగ ఘనమైన ధ్వనితోడ గ్రక్కు
ననుబలికె - సభవారు మీరంత పతినినిందించేరు పాపంబు మీకొచ్చు
పణతిశపియిస్తె - అతిపతివ్రిత బాల అందరును మన్నించి పెండ్లిచేయువ
లయు ప్రఖ్యాతిగాను - చిత్రముగ యీరాజు సృష్టిలోబుట్టెను చిత్రాం
గుడనుపేరు చెప్పకోవలెను - అనియిట్లు గగనంబు యతివింతగా బలుక
పంచభూతాలపుడు భళిభళీయనుచు - దేవేంద్రదేవతలు దీవించిరావే
ళ పూలవానయుగురిసె భువి తేజముగను - హరిహరబ్రహ్మాదు లతిభ
యంకరముగా దివినుండి జయమనుచు దీవించిరపుడు - ఆకాశవాణి
టుల ఆశ్చర్యముగ బలుక సభవారు మెచ్చిరి సఖియ సుందరిని -
ధర్మాంగరాజపుడు తనకోడలనుజూచి కాళ్ళు గడగడ వణికి కౌగిటను
జేర్చి - కోడలానాపైని కోపించబోకమ్మ నీ మనసు యెరుగనా నేను
మాతల్లి - నెలతరో నీమనసు నేనెరిగితిని కాని లోకమును మెప్పింప
నాకు తరమగునె - అందుచేతనుతల్లి అందరును వినుచుండ ఖండించిఅడి
గితిని కాంతరో నిన్ను - అడిగినందుకు యిపుడు అనుమానములుదీరె
జనులకెల్లనుచాల జగతిలోపలను - ఇటుపైని నీకీర్తిఇలలోనునాతల్లికథ
లురీతిగముందు బుధులుచెప్పదురు - కోడలా నీ పలుకులో నిచ్చెదను
గాని నీవంటి గుణశాలి లోకమునగలదె - సుందరిని యీ లాగు పొం
దుగా మన్నించిరత్నాంగరాజుతో రాజసంబుగను - బావకోపినాతోటి
బంధుత్వమునుజేసి పుణ్యాంబుమాకొచ్చె పుడమిలోపలను - తమవల్లనే
మాకుధరణిపాలనగలిగె అష్టభోగమువచ్చె సృష్టిలోపలను - రత్నాం
గరాజువిన రంజిల్లమీకీర్తి ఆచంద్రతారార్క మభివృద్ధిగాను - వీరకా
ఉనియట్టునేరపునమన్నించి సభవారినేజూచి జననాథుడనెను - సభవా
రునాపైని చాలదయలనుగలిగి చిత్రాంగ రాజునకు శీఘ్రింబుగాను -
లోకప్రఖ్యాతిగా లోలాక్షిసుందరికి పెండ్లిచేయవలెను ప్రఖ్యాతిగాను
అనియిట్లు ధర్మాంగు డందరికి వినిపించి తనమంత్రి హితులతో దారు
బల్కెనుగా - మంత్రిపుంగవులార మనపురము తక్షణమె ముస్తాబు
చెయ్యమని ముందుసాటించి - కోట శృంగారించి మేలైన పందిళ్ళు
వేయించి బందువుల వేగరప్పించి - మరి మేళతాళములు మేలుగా
రప్పించి జరుగురుగ యత్నాలు జరిగింపు మనెను - సెలవంది మం

త్రులును శీఘ్రముగ బురికేగి పనివాళ్ళబిలిపించిపట్ణమంతటను-చిత్రాం
గదునిపెండ్లి శీఘ్రముగ రేపంచు సాటించె నా వేళ నీటుగానపుడు -
ఆపలుకులువినిజనులు ఆనందమునుబొంది ఎవరిగృహములు వారెలమిమీ
రగను । అంతటపందిళ్ళు అతివేగవేయించి మెరుగుసున్నాలపుడు మేడల
కునలది । నీలంపుగోడలకు నీమైనముత్యాల మ్రుగ్గులేబెట్టిరిమురుపుచార
గనువీధివాకిళ్ళంతవింతగాపన్నీరుకళ్ళాపులేసిరికడుచల్లగాను । పచ్చతోర
ణములుపందిళ్ళకేగట్టి మేల్కట్టుకట్టిరిమేడకంతటను । రత్నాలచావిళ్ళు
రంగురంగులువేసి చిత్తరువు వేసిరి చిత్రముగనపుడు । ఈరీతి బురజనులు
యెవరిగృహములువారు ముస్తాబుజేసిరి మోద మలరగను । అటుపైన
కోటలోనర్మిలీదేవపుడు కొడుకుకోడలుకబురుకొమ్మ్రతావినెను - ఆనంద
ముగపొంగి యపుడు దాసులుచూచి లోనిలుముస్తాబు వేగచేయించె
కోటప్రహరీలపుడు నీమైన మరి పాలసున్నంబు మెరుగపుడు సూటివేయిం
చె । అన్నివాకిళ్ళందుఅందమైనటువంటి పందిళ్ళు వేయించెబాగుమీరగను
కస్తూరిపన్నీరుకలిపి భువనములెల్ల అంతటలికించిరిఅంతవింతగాను - చిత్ర
మైనటువంటి చిత్రవిచిత్రాలు ముగ్గులును మురుపుగాముదమొప్పదాల్చె
అవనిలోగలయట్టి యతిబుధులకోటులను యతివేగ రప్పించె హితవుమీ
రగను । కొదువేమిలేకుండకోట్లగా సామానుజేర్పించిరప్పుడు చెన్నుమీ
రగను । అర్మిలీదేవపుడునతివేగమునవెళ్ళి యత్నములు జేయించెయెలమి
మీరగనురత్నాంగరాజపుడు రంజిల్లుమూర్తమున వజ్రాలఅంబారివర
దంతిపైని । చిత్రముగగట్టించి చిత్రాంగరాజునకు కూర్చుండనియమించి
కోరికలరగను । అద్దాలపల్లకిలో అపుడుసుందరినుంచి తర్లించుకొచ్చిరీతిగ
బురమునకును । మండలాధిపులెల్ల మరిచుట్టునడువంగ వీరకాడునుతాను
కోరిముందుగను భేరీమారాలు పెద్దబూరలుమ్రోవ ఘంకానిశానీలు
పొంకముగచెలగ । రముఝోలుఢక్కీలురభసముగ మ్రోవంగ బాకాలు
లనరీలు బాగుగామ్రోవ - పట్ణంబుచుట్టునా పదివేలుపదిలక్ష లంకపుర్లు
నుకాలెపొంగమలరగను - అద్భుదంబులకొలది నంతరిక్షాలంట రవ్వ
యెగరెను ఝువ్వుమనగాను - కోటానకోటులే కొమ్మ్రశేకులవలెను మల్లి
పువ్వులవాన మరిగురిసినట్లు - చిత్రమైనటువంటి చక్రంబులేకాలె అద్భు
దంబులుకొలది అతివింతగాను - మరి తెరపిలేనట్టి మహతాబులేకాలెపట్ణ
మంతట పట్టపగలాయెనపుడు - బల్లకట్లామీద పసిడిపొమ్మలాగు వార
కాంతలుమేజువాణీలుచేసె - అప్పుడాపురజనులు ఆనందముగవారు హె
చ్చుముస్తాబులను శీఘ్రమునదాల్చి । ధర్మాంగరాజపుడు తగిగసంబ్రాల

తో తగపెద్దవీథిని తర్లించుకొచ్చె - రత్నంపుపళ్లెమున రాణించుకపురం బు దివ్యమైనటువంటి దీపంబులుంచి - నారకొప్పులతోను జారువయ్యెద లతో హస్తకంకణములునతివింతమ్రోవ సీటుగాబురజనుల నివ్వాళులే పట్టి దేదీప్యముగవారు తేజరిల్లగను - ధర్మాంగరాజపుడు తనరెండుపిడి కెళ్ళువరహాలు మొహరీలువరుసనిచ్చెనుగా - ధర్మాంగరాజింట నపకీర్తి బోకుండకోరినట్లుగనిచ్చె కోమలాంగులకు। వందిమాగధులపుడు వరస్తో త్రములుసేయ మోదమున బ్రాహ్మణులు వేదములుచదువ - ముత్యాల శాలలేముదితలునుజల్లగను - వరభటులు మేలుకైవారములుసేయ సకల సంభ్రాలిట్లుజగతిప్రఖ్యాతిగాతర్లించుకొనివచ్చె తనకోటలోకి। దేవతలు యావత్తుదివినుండి యాపూలవానగురిపించిరి వసుధపైనపుడు। చిత్రాం గదుడు పెండ్లిచిత్రంబు చూతమని దివినుండి దేవతలు దిగివచ్చిరపుడు హంసవాహనమెక్కి యా బ్రహ్మదేవుండు భారతిదేవితో బాగుమీర గను - వైనతేయుని నెక్కి వైకుంఠవాసుండు ఆదిలక్ష్మితోనుఅపుడు వేం చేసె - నందివాహనమెక్కి నగరాగసుతపరుడు పార్వతీదేవితో బాగుగా వచ్చె ఐరావతమునెక్కి అపుడు దేవేంద్రుడు శచీదేవితోగూడి శీఘ్ర ముగవచ్చె - వీణెలనుమీటుచును వేడుకగాపాడుచును నారదాదులుతుం బురులుకోరివచ్చిరిగా - రంభాదిమొదలుగా రమణులెవచ్చిరి చిత్రాంగ దునిపెండ్లి చెలువుచూడగను.

—* బ్రహ్మ విష్ణు రుద్రాదులు రంభ వూర్వశి మొదలైన వారలు చిత్రాంగరాజునకు త్రైలోక్యసుందరిన్ని కంకణములు ధరించుట. *—

దేవతలనందరికిని తేటగాపరికించి ధర్మాంగదుండపుడు తనువుపు ప్పొంగి - తనవారలనుజూచి తానపుడుసెలవిచ్చె కాళ్ళగోళ్ళేగ కాని వ్వమనగ - చిత్రాంగరాజునకు చిన్నిసుందరికపుడు చేతులూతలుగొంచు చెలులువచ్చిరిగ - పేరయినరత్నాల పెండ్లిపీటలుమీద కూర్చుండబెట్టిరి కోరికలరగను - శ్రీదేవితావచ్చిచిత్రాంగరాజుకునుకుడివైపుకూర్చుండె కొమ్మవింతగను - వామభాగమునందు పార్వతిదేవి వింతగాకూర్చుండె వేడుకలరగాను - యారీతికూర్చుండ నెలమిగామంగలి కాళ్ళగోళ్ళేతీసె కడువింతగాను - రంభవూర్వశి మొదలురమణులుకూడు కొనికొట్నాలు దంపగనుకూడవచ్చిరిగా - హస్తకంకణములు నతివింతగామ్రోవరోకళ్ళ బట్టిరి లోలాక్షులెల్ల కొప్పులే వీడంగ కులము లల్లాడంగ నడుము లేయసియాడ నవకమలరగను - కంకణములును ఘల్లుఘల్లున మ్రోవ కొట్నాలుదంచిరి కాంతలందరును - కొట్నాల పాటలను కోరిబాడెద

మనుచు ఒకరికన్ననుముందు ఒకరు బాడెదరు సువ్వీసువ్వీసువ్వీసువ్వీ
సువ్వీసువ్వీలాలి సువ్వీసువ్వీ సువ్వీలాలి - సువ్వీసువ్వీ రామచంద్ర సు
వ్వీనీలవర్ణసువ్వీలాలి - సువ్వీనీలకంఠ సువ్వీసువ్వీ ఫాలనేత్ర సువ్వీఫాల
హస్త సువ్వీలాలి - వాలుకంటినీవురావె వరసకొట్నములుదంచ నీలవేణి
రావె నేడు నేడుదంచగను - బొమ్మంచుచీరగట్టి శారదాంబ నీవురావె
ఈతండు చీరగట్టి యింతికోనీవిపుడురావె - తెల్లంచుచీరగట్టిమల్లెమొగ్గ
లరవికెదొడగి పల్లవాక్షీనీవురావె బాగుమీరగను - మల్లెపువ్వుచీరక
ట్టినిద్దంపురవికెదొడగిముద్దుగుమ్మ నీవురావె మోద మలరగను - సెనగ
పువ్వు రవికెదొడగి చెంగావిచీరకట్టి తలిరుబోణి నీవురావె దంపుదం
దంచను - తొగురుచీరకట్టుకొని అగరుగంధముమలదిమేను చిగురుబోణి
నీవురావె చెలువుమీరగను - బోడసరము చీరకట్టి చేడె నీవు వేగ
రావె వేడుకలరకొట్నములు వేగదంచను - నీలిచీరగట్టివేగ నీరజాక్షి
నీవురావె మేలుగాను కొట్నములను వేగ దంచను - ముంతసరిగెచీరగ
ట్టినువ్వుపూలరవికె దొడగి ముదితగో నీవురావె ముద్దుసుందరి - నీల
వేణి నీవురావె నీ వరిధాన్యములు లేవె వీలుగాను కొట్నామూలు
చాలిదంచను - గుత్తమల్లె నిపుడు తేవె మొత్తముగా మనమంత
పోత్తెమాడి కొట్నములుపాలతిదంచను - చిత్రాంగినీవురావు శింభిధాన్య
మును తేవె చిత్రముగాకొట్నములచెలియదంచకను - కంబుకంఠినీవురావె
కాసిసన్నాలు తేవె అంబుజాక్షి కొట్నమూలు అపుడుదంచను - మంద
యానసీవురావె మల్లెచన్నలుగాను తేవె అందముగా కొట్నమూలు
అపుడుదంచను - కీరవాణినీవు తేవె కృష్ణపత్రియాగములు మంచి కోరిక
లర కొట్నమూలు కొమ్మదంచను - మహారాజు భోగమూలు మగువ
నీవు వేగ దేవె మోహమలరగ కొట్నమూలు వేగదంచను - రంభనీవు
వేగ తేవె రాజసరిగ ధాన్యమూలు కంబుకంఠి నీవు తేవె కాశిసన్నలు -
పూర్వసిరోనీవు తేవె కాశిసన్నలు - పూర్వశిరో నీవు తేవె పూబసన్న
ధాన్యము గీర్వాణినీవు తేవె శాల్యధాన్యము - ముద్దుగుమ్మనీవు రావె
మద్దిమహాపాళి తేవె సుద్దిగాను కొట్నమూలు సుదతి దంచను - రత్నస
రులు నీవు తేవె రమణి కొట్నమూలు దంచి దుంగిబోగమూలు తేవె
మోదమలరగను - సాల కంఠిధాన్యమూలు పద్మాక్షి నీవు దేవె నీలకం
ఠలూను తేవె నీవు దంచను రాజనరను వేగ దేవె రాజసముగ కొ
ట్నమూలు రాజవదన నీవురావె రమణిదంచను - వారిజాక్షి నీవు దేవె
పజ్ఞానధాన్యమూలు హంసగమన నివు దేవె అతివజాడలు - బోటినీవు

వేగదేవె బొల్లికంటె ధాన్యమూలు సింహమధ్యనీవుతేవె చిట్టిమల్లె లూ - సువ్విపాట వార్ధిశయన సువ్విపక్షి రాజగమన సువ్విసారసాక్షి వినుత సువ్విగాలి - రంభాది కాంతలు రభసమున యీలాగు కొట్నము లుదంచిరి కోరికలరగను - శచీదేవి భారతి చేతులును బట్టుకొని త్రై లోక్య సుందరిని తీసుకొచ్చెనుగా - అంతఃపురికేతెంచ అంగనామణు లంత నలినాక్షి సుంతరికి నలుగుపెట్టిరిగా - మేలైన కస్తూరి మిళితమై నటువంటి సున్నపిండియుదెచ్చి చెలియకలదిరిగా - హాస్తకంకణాలు అపుడు గల్లునమ్రోవ నాతులందరుగూడి నలుగుబెట్టిరిగా - చిత్రాం గరాజునకు చెలియలందరుగూడి నలుగుబెట్టిరిచాల నవకమలరగను - దంపతుల నిద్దరిని వరుసగా పీటలపై కూర్చుండబెట్టిరి కోరికలరగను సూర్యవంశములకెల్ల అర్యుడైనటువంటి వాశిష్టమునివచ్చె వనితతో గూడ - అరుంధతీదేవి ఆవశిష్టుడువచ్చె హోమమును చేయింప నియ మములరగను - దేవముని తాగనుక దివ్యమైనటువంటి మంత్రతంత్రా లపుడు మరిచెప్పకుండ - చిత్రాంగరాజుచే చిన్నసుందరి మెడను ఘన మంగళాసూత్రం గట్టించిరపుడు - బంగారుచేతిలో రంగైనమణి ఆణి.

-* చిత్రాంగరాజునకున్ను త్రైలోక్య సుందరికిన్ని వివాహంబగుట *-

ముత్యాలుదెచ్చిరి ముదితలందరును - చిత్రాంగరాజపుడు చిన్ని సుందరితలను దోసిళ్ళ తలంబ్రాలు బోసెనావేళ - శశిదేవి భారతి చిన్నిసుందరిచేత తలంబ్రాలు బోయించె తక్షణంబునను - ఈరీతితలం బ్రాలు యిరువురిపై బోయించి మిగిలిన ముత్తెములు మెలతలందరును వారి మీదను వీరు వీరి మీదను వారు జల్లులాడిరి యెంతో సరస ములరగను - రత్నాలపళ్ళెముల రాజధర్మాంగధుడు పసిడి అక్షతలు బాగుగా దెచ్చి - తనపురోహితుడయిన తగవసిష్టునకిచ్చి అందుకొని వసి ష్టుడందరినిచూచి హెచ్చుతగ్గులుచూచి హేమ అక్షతములు అందరికి తప్పకను అందిచ్చెనపుడు - వారందరందుకొని వాసిగా దంపతులు శిర సులనుదీవించి వేసిరక్షతలు - ధర్మాంగరాజపుడు తగుబంధుకోటులకు భోజనము వడ్డింప నపుడు యోచించి వేయికన్నులవాని వేడుకొనె నావేళ.

—* భోజనము వర్ణనము. *—

కామధేనువుతనకు - ప్రేమనిమ్మనుచు ధర్మాంగరాజపుడుతను వేడు కొగాను - దయవచ్చిఋుంద్రుండు దయచేసెనపుడు స్వామి సెలవందితా కామధేనువచ్చి - అందరినిపరికించి అతివేగమునను పంచభక్షాన్నము

లుపరమాన్నములుచాల - కూరయినకూరలు పెరుగు నేతులను అన్నిప దార్థంబులందరికితగినట్లు - కామధేనువుచాల కల్పించెనపుడు అదిచూచి ధర్మాంగు డానందమునుపొంది - బారచాపలుతెచ్చి బంతులే పఱచె మూడుమూర్తులుగూడి ముక్కోటిదేవతలు - ఒకరాజుగూర్చుండెవన్నె మీరగను బంధువులు దంపతులు బాజుబాజలువేరే - కూర్చుండ నియ మించెకోరియారాజు పసిడిఅరటాకులే వనదేవతలకేసి - రజితపళ్లెములపు డురాజులకువేసె బంగారుపళ్ళెముల బహుపదార్థంబులు - వనితలెల్లనుదె చ్చి వడ్డించిరపుడు వారకొప్పులతోను జారుపయ్యెదలతో - వరబసర నలతిరిగి వడ్డించిరపుడు గజ్జలనుమువ్వలను ఘల్లుఘల్లునమ్రోవ - నాట్య మాడినరీతి నాతులొడ్డించె ఇంకమారు మువ్వారు యింక మఱియొక మారు - ఐదుమారులుదెచ్చి అతివలొడ్డించె సురలకునుతగినట్టి వరలకు నుతగినట్టి - పేరుపేరులనడిగి వారువడ్డించె సురకాంతలెల్ల మఱివరకాం తలనుజూచి - దిగ్గుమనికల్లకులు సిగ్గులొందిరిగా అంతలో నటుదెలసి యింతులనుపరికించి - తమలోనతమరపుడుతలపోసుకొనిరి రంభయూరగ శులయినగారు వీరికిసాటి - ఘనమైనవీరికిని మఱిసాటిరాము దేవకన్యలు యిట్లు భావములోవర్ణించె - యింద్రాదిదేవతలు యింతులనుజూచిఒకరి మొగమును ఒకరు ఒప్పుగా జూచుకొని - తలయూచి తమలోన నమరు నెచ్చుచును ఈశ్వరుడు విష్ణుండు యింద్రుడునవ్వుచును - బ్రహ్మదేవుని ముఖము బాగుగాచూచి రాజకాంతలవింత తేజముగబుట్టించి - మనసు తులకీమాపు మఱియివ్వరాద పరియాచికలు యిట్లు బ్రహ్మతోబలుకుచు సకల పదార్థములు చాలభుజించె గఱిగఱిగ తెచ్చి గర్కునను లే చిరి - చేతులేగడగంగ చెలగివచ్చిరిగ పసిడిచెంబులనీళ్ళ పనాతులొడ్డిం చంగ - హస్తములుకడిగిరి అతివింతగాను ధర్మాంగరాజపుడు తాంబూల పట్టీలు అందరికితానిచ్చె అతివేగమునను ఆ రీతిగను పెండ్లి యయిదు రోజులుగడిపి - కొసనునాగవల్లి కోరిచేసిరిగ భగ్గుంబుక్కాలు భామలే దెచ్చిరి - వాసంతములుదెచ్చె వారుకొందరును సురలపై భగ్గుండ నరులు జల్లిరితోలుత - తిరిగివారలుజల్లె నరులపై నపుడు సురకాంతలెల్లను నర కాంతలనుబట్టి - వాసంతలుజల్లె వాసి మీరగను విష్ణు యీశ్వరులపై వేడుకతో పరసతులు.

—* నాగవల్లి. *—

భుక్కాలుభగ్గుండ పూనికొట్టిరి వైకుంఠవాసును పరనాగభూ షుండు రాజకాంతలబట్టి తేజమలరగను తమకంటులుప్పొంగ తమమోహ

ములుదీర - గనుపించెకౌగిటకలసినొక్కుచూను వలపులుట్టిపడంగ పల్కు
లనుబల్కి - పణతులకుచెక్కిళ్ళభగ్గుండనలది ముచ్చటలుదీరంగ ముద్దు
లేగని - సరస సల్లాపములు జరిగించిరపుడు ఇదియు సనుయంబనుచు ఇం
దిరాపతిసుతుడు - పువ్వులబాణములేసె పొలతులకునపుడు విరులబాణము
లపుడు వెలదులకునాడంగ - మనసులో మోహంబు మరిపట్టలేక వెఱ్రి
లెత్తినలాగు విఱ్ఱవీగుచువారు - దేవతుల నొకవింత వావులేదెలిపి ఒక
నికి పదిమంది వనితలేబట్టుకొని - వాసంతములుబోసె వరద బారగను
వారిమీదనువీరు వీరిమీదనువారు - నొమ్మియుద్ధములాగు తోచనా
వేళ అపుడువసంతంబు అతిరేకమై పార - భగ్గుండ బుక్కాలుపంచమై
చెలగె గంగసరస్వతియమున కలసిపారినలాగు - తెలుపు పసుపును ఎరు
పుగలసిపారెనుగా శ్రీలుపురుషులు నెంతోచిత్తములు పెనుగంగ - నవ
రత్నహారములునాడు తెగిరాలె చేదిపరిగెలులాగు చేతులకు దొరకకను
వాసంతమోటిలోవాలలాడుచును చిత్రాంగుపెండ్లితో చిత్రముతోయన్న
ట్లు - చిత్రవిచిత్రముగ చెలగులాడిరిగా సరస సల్లాపములు సాలించితరు
వాత - చల్లనియుదకము స్నానములుజేసె తెల్లనివస్త్రంబు లెల్లవారలు
కట్టి - సకలసంతోషమున నిలుచుండగాను ధర్మాంగరాజపుడు తనకొడు
కుకోడలిని - దండములుబెట్టుటకు తోడీసుకొచ్చె చిత్రాంగురాజునుచిన్ని
సుందరితోలుత - వైకుంఠవాసునికి వందనముజేసె తరువాత రుద్రునకుత
రువాతబ్రహ్మకును - తారతమ్యములెంచిదండములుపెట్టె వధుపువరుడు
నుగూడి వందనంబులుసేయ - దేవతలుదయవచ్చి దివ్యమైనట్టి వరము
లిచ్చెదమనుచు వారిమనసునబుట్ట - బ్రహ్మదేవుడుతొలుత బలికెనంతట
ను ఆచెంద్రతారార్క మభివృద్ధిగామీరు - వధువర్లుధరలోన వర్ధిల్లుమ
నెను బుండరీకాక్షుండు పూర్వజ్ఞానములిచ్చె - రజతాద్రినాధుండురాక
సంబిచ్చె దేవేంద్రుడావేళ దీవించివరమిచ్చె - విలువిద్యసాధనము వరత
త్వమిచ్చె దండధరుడావేళ ధర్మగుణములిచ్చె - వరపుత్ర సంపద వాశి
ష్టుడిచ్చె నగరాజసుతుడపుడు నగరభూషణలిచ్చె - యింద్రాది దేవతలు
సుందరంబిచ్చె అరుంధతిదేవి ఐదవతనంబిచ్చె - వాగ్భూషణములిచ్చె
వాణితానపుడు అష్టదిక్పాలకులు నిష్టసంపదలిచ్చె - కింపురుష కిన్నరులు
కీర్తులిచ్చిరిగా అఖిలదేవతలపుడు అద్భుతంబు కొలది - దివ్యవరములి
చ్చి దీవించిరపుడు ధర్మాంగరాజపుడు చిత్రాంగరాజునకు - పట్టంబునా
వేళ కట్టవలెననగ ఆకాశగంగయూ అనిబుషులుచెప్పించి భూలోకమం
దున్న పుణ్యగంగలను తనవారులనుబంపి తక్షణముతెప్పించి - చిత్రాం

గరాజుపట్టాభిషేకము వాసిష్టుడావేళ వరమంత్రములను । చిత్రాంగ రాజునుసింహాసనమునందుకూర్చుండనియమించె కోరికలరగను - శాస్త్ర పద్ధతిగాను సారమగు నుదకములు అభిషేకములుజేసి అతిమంత్రము లను । వాసిష్టుడావేళ వసుదేవసుతునకు పట్టభద్రునిచేసె బాగుమీరగ ను । అంబులుఘోషించి అవనిగడగడవణక దిగ్గజములు తలలు దించె నావేళ । దిశలెల్ల తెల్లబారిదివ్యతేజము మెరసె చిత్రాంగదునికీర్తిచిన్నె లోయనగ - దివ్యతిరుపతులందు దీపములుప్రజ్వరిల్లె యెల్లజనులకు మన ములుల్లసిల్లెనుగా । బుధగ్రహంబున ఒక్కచోటున నెలచినవి సూర్య చంద్రులుమిగులచోద్యముగవెలిగె । దుందుభులుమ్రోసెను తుంబురులు బాడిరి నారదుడు వొకవింత నాట్యమాడెనుగా । దేవేంద్రదేవతలుదీవిం చి అక్షతలు వధువరతలలపై వారువేసిరిగా ఆరీతిదీవించి అమరులును

యావత్తు యెవరిలోకములకువారునేగిరిగా - దంపతులుచుట్టాలు ధర్మాం గరాజొద్ద । సెలవులందుకునిచనిరి శీఘ్రింబుగాను । రత్నాంగరాజపుడు రాజసంబలరంగ అల్లుడినికూతురని అపుడుదీవించి । వీరకాంనియింటనేరు పునకొన్నాళ్ళు సరసపదార్థములు చాలభుజియించి । చిన్నసుందరినపుడు మన్నించిదీవించి నాయమ్మతల్లి నాముద్దుచిలుక । రత్నాంగ రాజింట రంజిల్లనీవుపుట్టిపోకుండ నిలిపితివి పాలతినాతల్లి । నాకీర్తిపోకుండ నీకీర్తి పోకుండ నరుల సురులా యెదుట నయముమీరగను । దివ్యతిరుపతు లందు తీరుగా మముదలచి సేవించి తిరిగితివి చిన్నారి చిలుక - నీవల్లనె మాకునేడు బుణ్యమునబ్బెధన్యుల ఖతిమిమేముధరణిలోపలను । అత్తిల్లు పుట్టిల్లు అబల నీవల్లనే యేడుతరములవరకు యిలగీర్తినొందె - కూతు రుని యీలాగు ప్రీతిగామన్నించి తనబలంబులతోను తానపుడులేచె

ధర్మాంగరాజొద్ద తమసెలవు గోరంగ ధర్మాంగరాజపుడు తక్షణంబు ననువీరకాంనిని చాలకూరిమిగమన్నించి గుఱ్ఱములుయేనుగులుగొప్పవస్తు వులు రత్నాంగరాజునకు రాజసంబలరంగ కట్నంబులిప్పించె ఘనముగా నపుడు । తరువాత బలములకు తగినట్టులందరికిని తప్పకుండగనిచ్చె తాను కట్నములు । కట్నంబుతమరంది కడుసెలవు లందుకొని రత్నాంగరాజు తన రాజ్యమున కేగె - తరువాతధర్మాంగు తగువంటబ్రాహ్మణులకువరహాలు మొహరీలువరుననిచ్చెనుగా తమబంధుకోటులకు దగిన కట్నములిచ్చిఅంప కములుజేసెఅపుడు ధర్మాంగు - తమపెద్దమంత్రి తక్షణమెపిలిపించి ఘన ముగా మన్నించి కౌగిటనుజేర్చె.

—* ధర్మాంగదుడు తన మంత్రిని స్తోత్రము చేయుట. *—

ఓమంత్రిపుంగవా యోగుణధామ నీవల్ల మాకుదుర నెగడొందె
ధరలో - ఆపదొచ్చెగనుక అతిభయంబున నేను మీరుదెలియక నిన్ను
మించనాడితిని - రాజమత్తతచేత రాజ్య మేలుటె కాని దూరదృష్టియులేని
దూర్తులము మేము - మాతప్పులను కాచి మమ్ము మన్ననజేసి ఇటుపైని
ఈరాజ్య మేలుకోవయ్య - ఇపుడు చిత్రాంగదుని యిలపతిని జేసితివి
యిలలోన మీరిపుడు యిలకీర్తిగాను - అనుకూలమున నేలి ఆనందముగ
నుండి అన్నదమ్ములవలెను అనుకూలముననను - అనియిట్లు మంత్రిని అతి
మన్ననలుజేసి తరువాత సుందరి తానుపచరించి - కౌగిటను తాజేర్చి
కన్నీరురాలుకంగ చిన్నిసుందరికపుడు మన్నించి పలికె - కోడలానీవల్ల
కొడుకుకలిగెనునాకు వంశంబునిలిపితి వసుధగోపలను - నీపతివ్రత మహి
మనేటినుండియుభువినివరకథలురీతిగా వాడుకలుబుట్టు - కోడలామరినీవు
కుదురునిలిపితివమ్మ నీకంటె గుణశాలిలోకమునగలద - మామగారీలాగు
మన్ననలుసేయంగ అత్తఅర్మిలీదేవి అపుడుసుందరిని - కదసి కౌగిటబట్టి
కటకటంబడిబలికె కోడలానాపైనికోపముంచకుమి - నీమనసు తెలియక
నునిందించితినితల్లి ఆపాపఫలమికను అనుభవంబౌనుఅతిపతివ్రతవునీవుల
వనిలోగలయట్టిదివ్యతీరుపతులన్నితిరిగిసేవించి - మమ్ము ధన్యులజేయమ
గుడివచ్చితివమ్మ బుణ్యంబుమాకబ్బె పొలతి నీవలన - నాగరాజునుబ
ట్టినరనాథుచేసితివి లోకజనులుమెచ్చ నాకుయిచ్చితివి ఆకాశవాణిచే
అపుడు బలికించితివి ప్రజల మెప్పించితివి ప్రఖ్యాతిగాను - మాకుకీర్తులు
దెచ్చి మాకుదురునిలిపితివి నీకంటె గుణశాలి లోకమున గలద - యిటు
పైనికీర్తి యిలజనులు యావత్తు యేడుతరములవరకు దెలుచుకుందు
రుగ - కథలురీతినినీదు ఘనకీర్తులనుయెంచి చెప్పుకొందురుతల్లి చిన్న
పెద్దలును - కోడలా ఇటుపైన కోరి చిత్రాంగుతో చిరకాలమును
గూడి క్షితినివర్ధిల్లు నవమన్మథునికంటె నవనమైనటువంటి కొడుకు
లను పెక్కండ్ర కొమ్మనీవుండ - దానురాతంపరై ధరణిలోవర్ధిల్లి కలిమి
ఫలములలోను తులదూగవలెను - అనియిట్లు అర్మిలియు అతిదీవనలు
యిచ్చె ధర్మాంగరాజపుడు తనసుతునిచూచె.

—* ధర్మాంగధుడు చిత్రాంగునకు బుద్ధిచెప్పుట. *—

నాగర్భవాసమున నాగరాజై నీవు బుట్టినాడవు సుమ్మి బుడమ
లరంగ ఘనమంత్రి ఆపయిని మాయకల్పనజేసి సుందరిని దెచ్చెను
నూటిమీరగను - రమణిబున్యమువలన రాజైతివిలలోన చిత్రమైతో

చెను సృష్టిలోపలను - ఆకాశవాణియు అతివింతగాదిక్కు చిత్రాంగు డనుపేరు చెప్పివెళ్ళెనుగా - పేరుకును తగినట్లు పరిజలమతి పాలించి మనమంత్రిమాటపై మసలుకోవలెను - దుష్టజన శిక్షణా శిష్టజనపాల నాతప్పకను జరిగించి ధరనేలవలెను - పరధనంబులయూస పరకాంత భ్రమలను కలనైన నీవు మానిలనేలవలెను - నియమముగధర్మంబు నాల్గు పాదంబులను తప్పకను జరిగించి ధరయేలుకొమ్మి - తాత తండ్రులకీర్తి తొలగిపోగొట్టకను నీతిగాధరయేలి నెగడొందవలెను - మరికొన్ని ఈ లాగు మంచిమాటలుజెప్పి చిత్రాంగరాజునకును ధరనొప్పగించి - తన భార్య అర్మిలియు తాను సుఖముననుండె యితరచింతలుమాన యేకచి త్తమున - అటుపైని చిత్రాంగు డవనిపాలనజేసి తండ్రిచెప్పినకన్న తగ మేలుగాను - వసుధ బాలనజేసి వరసుందరినిగూడి అష్టఐశ్వర్యాలుయిష్ట భోగములు - అనుభవించుచు తాను అవని బాలించుచును చిత్రముగ ధరయేలె చిత్రాంగదుండు - అనియిట్లు యీ కథా ఘనమౌని గౌతము డు తనభార్య అహల్యతో తానుసెలవిచ్చె - పుణ్యకథ సమముగా పొం దుగావిని తాను అపుడహల్యాదేవి యాశ్చర్యమొంది ముల్లోకసుంద రిని వుల్లమందున మెచ్చి తలయూచి తనలో తానులజ్జించి - పతితోడనే మారుబలుకజాలక నుండె అదియెరిగి గౌతముడు అపుడూరకుండె - చిత్రాంగుకథగనుక క్షితిజనులు యెవరైన పాడివ్రాసిన వారిపాపముల్ దొలగు - బుణ్యకథ యిదిగనుక పొందుగా విన్నను ధనధాన్య సంప దలు తమకుసమకూడు - అద్భుతపుకథ గనుక అందరికిని భువిలోన తెలి య జెప్పితినిపుడు తేటగా మీకు - కూరిమితో పూరి నారాయణరాజు యీపాట తెనిగించె యెలమిమీరగను - యతిగణప్రాసలు యేమియెరు గనుగాని శ్రీవిష్ణుదయచేత జెప్పినానుగ - సాంతముగ యీ కథయు సరిగను వినివారు యెవరియిండ్లకువారు నేగవచ్చునుగా - జయమంగ ళంనిత్య శుభమంగళం జయాజయమంగళం మహావిజయ మంగళం - హరిహరి నారాయణాది నారాయణా కరుణించి మమ్మేలు కమల లోచనుడా.

ధర్మాంగచరిత్ర - పాముపాట.

సంపూర్ణము.

—(*)—

శ్రీలక్ష్మీవిలాసం ముద్రాక్షరశాల, చెన్నపురి. 11-4-1945.

# మహా చందనాది తైలము.

ఈ తైలము అనేక మూలికలవలనను మేలయిన దేవదారి చెక్కల సత్తువల్లను ఆవుపాలు మొదలగు శ్రేష్ఠమైన వస్తువులనుచేర్చి ఆయుర్వేదపద్ధతి ప్రకారము తయారుచేయబడినది. దీని వారమునకు రెండుతూరులు సిరసులో రుద్ది సీకాయతోపులిమి వేడినీళ్ళలోస్నానము చేయవలెయును. అట్లు చేయుటవలన కంటిపుంట, కంటిలో నీరుకారుట, చెవులునొప్పి, తలబారము, మెదురుపుడుకుట, ఒంటితలనొప్పి, తల నొప్పి, మైకము, సాలేశ్వరము, పిత్తపాండు, కామాలా, అస్థిజ్వరము, నాలుక యెండిపోవుట, కాలు చేతులు మంటలు, మేగరోగములు, మొదలగు వ్యాధులను పోగొట్టి చల్లచేయును. వెండ్రుకలు నల్లగాను నిడువుగాను పెరుగును. ఈ తైలము అంటి స్నానము చేయుదినము శీతల వస్తువులున్ను, పెరుగు, మజ్జిగ, పగటినిద్ర, స్త్రీసంభోగము మొదలగునవి తోసిపెట్టవలయును.

| | | |
|---|---|---|
| 1 సేరు తైలము | రూ. | 1-12-0 |
| అరసేరు తైలము | రూ. | 1-0-0 |

# మహా మేరు తైలము.

ఇది కంటమునకు పైబడిన వ్యాధులకెల్ల మిక్కిలి శ్రేష్ఠమైనమందు. సిరస్సులోచేరిన వాతనీరు, పిత్తనీరు, మేగనీరు, సాలేశ్వరము, సిరస్సులో నవ్వ, మంట, తలవెండ్రుకలు రాలుట, తలపుండ్లు, తలతిరుగుట, మైకము, ఇటువంటి జాడ్యములను తీర్చును. ఇంకను మేగమువల్లను నెత్తురుచెడిపోయి ఒడలంతను నవ్వ. గజ్జి, తామర ఒడలు యెండిపోవుట, ఒడలు తెలుపగుట, కంటిలోను ముఖములోను నెత్తురులేకపోవుట, వీటి నన్నిటియు పారదోలి మంచినెత్తురు కలుగజేయును. ఈతైలము 4 రోజులకు ఒకతూరి వేకువ జాములో తల అంటుకొని స్థానము చేయవలయును. నాటిదినము పగటినిద్ర, పెరుగు, ఇతర శీతలమైన వస్తువులు పుచ్చుకొనకూడదు.

| | | |
|---|---|---|
| ఆళాకు నూనె | రూ. | 1-8-0 |
| 2 బుడ్లు కొనువారికి | రూ. | 1-0-0 |

సి. ఎస్. రాజన్ వైద్యశాల, 4, వడమలై మేస్త్రి వీధి, మొదటిసందు సౌకారుపేటపోస్టు, మదరాసు.

### బంగారు గుళికెలు.

రక్తమును శుద్ధపఱచును, రక్తమువృద్ధియగును, ధాతుపుష్టి కలుగును, ఆకలి అధికమగును, దేహమందలి నరములు ఎముకలకు రక్తము ప్రసరించి బలమునిచ్చును.

ఇంకను యిందువలన క్షయరోగము, మేహవ్యాధులు, దినములు గడచిన కొరుకు, తెలుపు, మేహకారకము మొదలగు సమస్తమైన మేహ జాడ్యములను ఖండించును. దీనిని స్త్రీ పురుషు లిరువర్లు విడువక సేవించిన పుత్రసంతానము బడయుదురు. ఇంకను యీమాత్రల వలన అజీర్ణము, బలహీనము తీరును, చేతులు కాళ్లు అశక్తత పోగొట్టి శరీరము వజ్రమువలెజేసి ధాతు సంబంధమగు జాడ్యములను స్వస్థపఱచును. ఇందుచే కడుపునొప్పి, కడుపులో కలుగు సర్వవిధవ్రణములు పోగొట్టును, అదియుగాక కడుపులోని ప్రేగులలో కలుగు పుండ్లు, వ్రణములు, ఒకవిధమైన శబ్దము. యివిగూడ హరించును.

50 మాత్రలు సీసా 1-కి 5-0-0
100 మాత్రలు సీసా 1-కి 7-0-0

### ఊరుపిచ్చుకల సత్తువలేహ్యాం.

మిత్రులారా! మన శరీరమునకు బలము కావలయునేని మాంసము భుజించెదము. అది పుష్టికరమగుటచేత దాని భుజించి రక్తవృద్ధిని తద్వారా శరీరము బలపరచెదము. కాలిలో బలములేనిచో కాళ్లసూపులు భుజించి కాలికి మంచిబలమును కలిగించుచున్నాము. మెదడునకు బలములేనిచో మెదడును భుజించుచున్నాము. శరీరములో యేయే అవయవములు బలహీనమగునో రక్తసత్తువగల పదార్థమగు మాంసములో ఆయాభాగములను భుజించిన యెడల ఆయాభాగమును బలపడుట ప్రసిద్ధమే గదా! అట్లుండుటచే ధాతువు తక్కువపడక వృద్ధియగుటకును బలపరచుటకును దాని చెడుగులు నివర్తి కావలయునంటే రక్తసత్తు గలదియు పురుషచిహ్నముయొక్క ముఖ్యనరములలో మిగుల బలముగలదియు సుఖమును పొందుటలో ప్రధాపాన శేయును విసుగుజెందని భోగము గలదియు దానిచే శరీరము చెడుగుణమును బొందినదియు నైన ఊరుపిచ్చుకల లేహ్యమునే భుజించవలయును. దీనివలన నేయేలాభములను పొందకూడునో దాని భుజించిన పిదప తమకుతామే తెలిసికొనవలసినదియే గాక మేముచెప్ప నక్కరలేదు. పత్యంలేదు.

20 రోజులకు 2-0-0
40 రోజులకు 3-0-0

### (శ్యామలా) వెంట్రుకలు పెరుగు తైలము.

5 పలములుగ్గల డబ్బి 2-కి 2-0-0
డిటో డబ్బి 6-కి 4-8-0

సి. ఎస్. రాజన్ వైద్యశాల, సాకారుపేటపోస్టు, మదరాసు.

సంగీతస్వర చింతామణి.

ఈ మందు పాడునట్టిశక్తిని అధికపఱచును. కోకిలవలె స్వరము నిచ్చునట్టి పరమౌషధము గొంతులో వ్రణము క్రమ్ముట గఱగఱవు దీనిని మాన్పి నాభి మొదలు గొంతు వఱకు చక్కని బలము నిచ్చును. ఈ మందు సంగీత విద్వాంసులకున్ను ప్రసంగముచేయువారికి పురాణములు చెప్పువారికి అనుకూలమయినది.

సీసా 2-కి 1-8-0

రహస్యతిలా.

ఇది లింగముయొక్క నరములు దృఢపరచి ధాతువృద్ధిని కలుగజేయును. నపుంసకత్వమును పారద్రోలును. ఇది పురుషులుతప్ప స్త్రీలు ఉపయోగింపగూడదు. దీనికి సాటియైన వేరుఔషధములేదు. రు. 1

హనుమంతసంజీవి లేహ్యము.

ఈ దివ్యౌషధము 40 దినములు సేవించినయెడల యవ్వనమందు కేవలము స్త్రీలోలురై యుండుట చేతను దేహపటుత్వముతప్పి సత్తువలేనివారై జీర్ణశక్తిలేక బలముడిగి జ్ఞాపకశక్తిలేక సంభోగవాంఛ బొత్తిగాలేనివారల దుఃఖమును పోగొట్టి శుక్లమును వృద్ధిపరచి యావ్వనవంతులుగా జేయుటయందు ప్రసిద్ధికెక్కినది. ఈ దివ్యౌషధము నపుంసకత్వము, త్వరిత స్ఖలనము లింగముయొక్క అశక్తతను పోగొట్టి నరములకు బలమిచ్చును. దేహమునకు తేజస్సు కలిగించును. ఈ లేహ్య భస్మములు, వృష్ణవాయువు, పార్శ్వవాయువు, పిత్త మయికం, నోరూరుట, పసరుబడుట, తలతిరుగుట, రొమ్మునొప్పి, కాళ్ళుచేతులుపోట్లు, మేహకాక, అశక్తి మొదలైనవి నివర్తించి ధాతువును గట్టిపరచి సౌఖ్యమును కలుగజేయును.

20 రోజులకువచ్చు లేహ్యం

వెండిభస్మము రూ॥ 2-0-0

40 రోజులలేహ్యంరూ. 4-0-0

పురుషులు ఉపయోగించు

రబ్బరు గొట్టము.

ఇదియొక అద్భుతమైన గొట్టము పురుషులు సకభోగ కాలమందు వుపయోగించుటకై ప్రత్యేకముగా తయారు చేయబడినది. స్త్రీలనుండి అంటురోగ్యాధులను పొందకుండ అడ్డగించుటకు యీ సాధనము కంటే వేరేదియు ఉపాయములేదు. దీనిని అందరును నుపయోగించ వచ్చును దీనిచే చెడుపేమియు కలుగదు.

వెల 1-0-0

మూలరోగలేహ్యం— లోపలి మూలము, బయటమూలము, చీముతోచేరినమూలము, బెట్టమూలము, రక్తమూలము మొదలగు పాతరోగములను సకలవిధ మేహవృష్ణముల నున్ను పారద్రోలును. మూలరోగులకు ఆస్పత్రిలో తీరకున్నను ఈ ఔషధమువల్ల నివర్తియగును.

డబ్బాల 2-0-0